శ్రీమతి

# దివ్యకథాసుధ

పవిత్రం చరితం యస్య
పవిత్రం జీవనం తథా
పవిత్రతా స్వరూపాయ
నమస్తస్మై నమోనమః

జి. నారాయణరావు బి. ఏ.,
" కావ్యశ్రీ "

శ్రీ వేదుల వేంకటరావుగారికి

శ్రీ గార్లంక వీరవేంకట సత్యనారాయణగారికి

కృతజ్ఞత :

శ్రీ బొడ్డుచెర్ల రవీంద్రనాథ్‌గారికి

శ్రీ రుద్రు వేంకటేశ్వర్లుగారికి

డాక్టర్ నాతాని వేంకట సుబ్బారావుగారికి

తొలిముద్రణ :
ఫిబ్రవరి 1959

మలిముద్రణ :
సెప్టెంబరు 19[illegible]

మూల్యము :
రూ. 2-00



ప్రింటర్స్ :

శ్రీ మండా ఆంజనేయులు

వాణీ ప్రెస్ * నరసరావుపేట.

శ్రీ గురుమూర్తయే నమః

# కృతి ప్రశంస

నా పౌత్రుఁడగు చిరంజీవి నారాయణరావు రచించిన యీ కావ్యరూపమగు "దివ్యకథాసుధ" నాస్వాదించు మహాభాగ్యము నొందిన నేను నా యానందము వెలిఁబుచ్చుకొనకుండుట యుచితము కాదనుకొనుచున్నాను.

ఈ కృతి యాకృతిలోఁ జిన్నదియే కాని కథావస్తువు ననుసరించి మిగుల గొప్పదియనుట నిర్వివాదము. నాయకుడగు శ్రీ రామకృష్ణపరమహంసయును జగన్మాత శారదాదేవియును భారతీయుల కుపాస్యదేవతలనుటలో విప్రతిపన్నులెవ్వరునుండరు గదా! శ్రీ శారదాదేవియు శ్రీ రామకృష్ణపరమహంసయుఁ బార్వతీపరమేశ్వరుల యవతారమూర్తులు అట్టి జగత్కళ్యాణ సంధాతల చరిత్రమునందాసక్తిగొన్న కృతికర్త శ్లాఘ్యచరితుఁడని వేఱ చెప్పవలయునా?

ఈ కావ్యము రెండు భాగములుగా నెన్నవచ్చును. మొదటిది శ్రీ రామకృష్ణపరమహంస జీవిత సంగ్రహము. రెండవది యా మహాత్ముని దివ్యబోధామృతప్రవాహము. ఈ రెండు భాగములు కలిపి మూడువందల పద్యములలో నిముడునట్లు లలిత పదనిగుంఫనముతో ధారాళమగు శయ్యతో మనోహరమగు భావములతో వెలయించిన చిరంజీవి నారాయణరావును నేను దీవింపఁదగిన వాఁడనైనను మెచ్చుకొనక తప్పినదికాదు. నేనేకాదు పాఠకలోకమున రసజ్ఞులగు వారలెల్లరు నీకావ్యమును కావ్యకర్తను మెచ్చనివారుగాని దీవింపనివారుగాని యుండరని నానిశ్చయము. ఈతని కవిత కొన్నిపట్ల పోతనామాత్యుని, కొన్నిపట్ల వేమనను దలపించుచు సహృదయుల హృదయముల నావర్జించుకొనుట

యెంతయు సంస్తవ్యము. ఇందలి రసము శాంతము. విరాగమున కాలంబమైన యిట్టి వస్తువుచేకాని పాతకలోకమున ననురాగముప్పతిల్ల రచించిన యీ కవి "నాతిలోనుండి రసముతీసె" ననుటలో సందియమేమున్నది ? అదికదా కవియగువాని ముఖ్యలక్షణము !

అర్థకామములకు నెందును దావొసంగక ధర్మమోక్షములనుమాత్రమే ప్రధానలక్ష్యములుగా జీవితమునంతయుఁ గడిపి లోకులకుఁ దమ యమృతమయ సూక్తులచే ధర్మమును మోక్షమును నుపదేశించిన పరమపూజ్యులైన రామకృష్ణ పరమహంస దంపతుల యద్భుతచరితమును ధర్మార్థకామముల యథాశక్తిపానుసించి మోక్షేచ్ఛువగు శ్రీ ముత్యాల సుబ్బారాయని జీవితనౌకకు ధ్రువతారగా సమర్పించి చిరంజీవి నారాయణరావు కృతకృత్యుఁడైనాడు. కవికొక్కనికే కాక కృతిభర్తతోపాటు పఠితలకు గూడఁ జతుర్వర్గోపదేష్టయై యీ కావ్యము—

"ధర్మార్థ కామమోక్షేషు వైచక్షణ్యం కలాసుచ
కరోతికీర్తిం ప్రీతించ సాధుకావ్య నిషేవణం"

అను వామనుని కవితాలక్షణమునకు చక్కని లక్ష్యమైనది.

ఇట్టి కావ్యరత్నముల నింకను వెలయించి సహృదయుల హృదయపూర్వక ధన్యవాదముల నందుకొన చిరంజీవి మా నారాయణరావున కాయురారోగ్యైశ్వర్యముల నొసంగుచు సర్వ విధాభ్యుదయములను పరమేశ్వరుఁ డనుగ్రహించునుగాక యని కోరుచున్నాను.

విశ్వావసు మాఘ
శుద్ధ విదియా
సోమవాసరము
అమలాపురము.

ఇట్లు,
విద్వత్ కవిశేఖర కవితాభూషణ
వెంపరాల సూర్యనారాయణశాస్త్రి

ఓం
# గురుభ్యో నమః

అల ప్రసన్నకథాకలితార్థయుక్తి
అలరు సుడికారమందు తీయందనాలు
ఆంధ్ర గీర్వాణశబ్దవిన్యాసగరిమ
ఒంటరిగఁ గొన్న మద్గురు నొగినుతింతు

కవితాసుమములఁ గొలిచెద
నవనీతసహృదయు "సూర్యనారాయణ శా
స్త్రి" విశుద్ధచరితు "విద్వత్
కవిశేఖరు" "వెంపరాల" "కవిభూషణు" నిన్

భావోత్తుంగతరంగసంఘములతో భాసిల్లు నియ్యాంధ్రభా
షావారాశినిఁ జిల్కి యాసుధల శిష్యానీకమున్ బెంచి వి
ద్యల్వై దుష్యషుఁగూర్పవే! పరమశాంతై కాత్మసిద్ధుండవై
నీవై శిష్యము వందనీయముగదా! నిత్యప్రఫుల్లాత్మకా

ఎంత తపంబుచేసి జనియించిన వారలో మీరు దేశదే
శాంతరభూములందును మహోన్నతగౌరవమంది పొందు కా
లాంతరసుస్థిరంబును దిగంతవిశాలమునైనకీర్తి కా
ద్యంతము నోడిపోయిరి ప్రభాకరచంద్రులె అస్తమించుటన్

ఆతతమైనవేడ్క విబుధావళి మీ మధురప్రపూర్ణమున్
శీతగిరీంద్రతుంగతటనిస్సృతనిర్ఝరమైన వాక్సుధా
పాతమునన్మునింగి కడుభక్తి ప్రపత్తినిఁ గేలుమోడ్చి మీ
ఖ్యాతిఁ దలంచి వాగ్రమణుగా మదినెంచి నమస్కరింపరే !

గురుతరకావ్యకల్పనలకున్ నిధియై నిగమార్థరాశియై
పరమపవిత్రహైందవశుభప్రదధర్మనవారవిందబం
ధురమకరందపూర్ణము మనోజ్ఞమునై తనరారు మీదు " శం
కరవిజయమ్ము " మిమ్ములజగద్విదితం బొనరించెఁ గీర్తిమై

అక్షయ్యమ్మగు వారిపూరఘనవేగాయత్తమౌ మీదు వా
క్యక్షీరార్ణవజాతపుష్పితసుధాకావ్యప్రసూనమ్ములన్
ద్రాక్షాపాకముగ్రోలి మైమరచి మీదౌమూర్తి వీక్షించి నే
సాక్షాత్తిక్కనగాఁదలంతు కవిరాజా ! మిమ్మునెల్లప్పుడున్

" కవితాభూషణ ! " మిమ్ములన్ బొగడుటల్ గాదిద్ది సత్యంబు మీ
నవగంభీరమనోజ్ఞమంజుపదవిన్యాసంబు వీక్షించినన్
శివదాస్యోద్గతవాక్సుధాలహరిఁ దాపంబారఁగా మున్గచో
నెవరైనన్ పరె చెప్పితీరు ప్రతిభాస్వీతా ! నమస్కారముల్.

# దివ్యవము

శ్రీ నిత్యాలయమై శుభావసథమై చెల్వొందు పంకేరుహా
మ్మెనాడున్ మలినంబు నంటక సదా యేపొందు; క్షీరాశమున్
పానీయంబగు క్షీరముంగొని రహిన్ వర్జించు నీరమ్ము; వి
జ్ఞానానందవిభావసుండుగను సంసారంబునన్ మోక్షమున్.

2

వారు మందాకినీవారిపూర మట్లు
పాపపంకిల క్షాళన ప్రణవ మట్లు
సర్వశాంతిప్రద మఘమర్షణముభంగి
అతిపవిత్రులు లోకకళ్యాణకరులు.

3

వారల సచ్చరిత్రములు పావన జీవన శీలవర్తనల్
ధారుణి మానవాళికి విధాత యొసంగిన హస్తదీపికల్
ధీరులమై తదీయ కరదీపికఁ జేకొని సారహీన సం
సారవిచారగహ్వరము సామమునన్ దరియింపగావలెన్.

4

అట్టి మహనీయులందు మహామనీషి
తత్త్వసంస్థాపనార్థమై తనువుఁగొన్న
రామకృష్ణుడు విశ్వ సామ్రాజ్యమునకు
మకుట మాతనిచరితమ్ము మానికమ్ము

5

గతకాలంబు ప్రవక్తలున్ ఋషులు నాఖ్యానించు తత్త్వార్థముల్
కతిపైకాలమునందు సద్గురులు వ్యాఖ్యానించు శాస్త్రార్థముల్
మతిచంద్రుండగు రామకృష్ణుఁడు నిజవ్యాపారతన్ జాటె; జీ
వితమే రెండవ గీతయై వరల నుర్వీమానవోత్తంసుఁడై.

6

శ్రీ రామకృష్ణ జీవిత
సారము "శ్రీ శారదాంబ" సహధర్మిణి! శ్రీ
శారదఁ దెలియక నాతని
పారము గనలేరు తత్త్వపండితులైనన్.

7

నయగారాజితపాత. నిస్సృతము గంగావాహినీప్రౌఢమున్
ప్రియసమ్మోహనమైన వాక్పటిమ పృధ్విన్ బంచఖండంబులన్
నయమింపారగ హైందవోన్నతిని సంధానించి ప్రామాణ్య ని
ర్ణయనిర్వాహకుఁడౌ "నరేంద్రు" నిచటన్ రక్తిన్ స్మరింపన్వలెన్.

8

రామకృష్ణని జీవితారామమందు
విరిసి తత్త్వార్థమంజులపరిమళములు
పంచఖండాలు నింపిన పారిజాత
సుమము! నిస్వార్థమానవోత్తముఁడతండు.

9

జగమున నాల్గుప్రక్కల ప్రచారమునున్న మతప్రబోధముల్
ప్రగతిపథమ్మునొంది యొకవార్ధిగ మారిన దానిరూపమే
యగణితతత్త్వధర్మ సుగుణాకరుఁడౌ యతి రామకృష్ణుఁ డీ
యుగపురుషుండు మానవమహోదయమార్గము జూపె నిద్ధరన్.

10

దేశ కళ్యాణ సాధన దీక్షలోన
జీవితమ్మునె త్యాగమ్ము చేయునట్టి
శిష్యులెవరికి గలరు వాసిని ఘటింప
పరమహంసకు గాక ప్రపంచమందు!

11

శాంతనవాది పూర్వులును శంకరులాది మతప్రవక్తలున్
సాంతము బ్రహ్మచర్యమును సల్పిరి పెండ్లినిమాని; కాని ధీ
మంతుఁడు రామకృష్ణుఁ డొక మానిని చెంత వసించి కూడ ని
శ్చింతగ బ్రహ్మచర్యమును చేసెను నిగ్రహమెంతగట్టిదో.

12

అతఁ డాపాదమస్తక "మాతృవైభ
వమ్ము" పరమపావన "దివ్యవైభవమ్ము"
అతని జీవిత చరిత కావ్యంబు సకల
మానవాళికి నిరత సమాశ్రితమ్ము.

# కథ

13

ఏదేశమునఁ జతుర్వేద మహోన్నతిఁ
జాటు హిమాలయాచలము గలదు
ఏదేశమునఁ దత్త్వ హేవాకమునకుఁ జి
హ్నాంబులౌ తతజీవ నములుగలవు
ఏదేశమున మతానేకసాయుజ్యమ్ము
తనరంగ నెల్ల మతములు గలవు
ఏదేశమున నెల్లఋతువుల సర్వస
ర్వంసహ ఫలపుష్పభరితయగును,

అట్టి భారతదేశ పూర్వార్ధమందు
వంగరాష్ట్రమ్ము సకల సంపన్న మందు
"ధారి" గ్రామమ్ము సిరులకాధార మచటఁ
జెలఁగు "మాణిక్యరాంచటర్జి" వరుండు.

14

వారల యింటబుట్టు ప్రతివారికి రాముని పేరుపెట్టు నా
చారము గానవచ్చు; దయ సత్యము ధర్మముగల్గి రాష్ట్రమున్
బేరునుగొన్న వంశమది; పెద్దలు త్యాగపరాయణుల్ సదా
చారులు రామభక్తులు; ప్రసన్నులు పేదల కన్నివేళలన్.

15

అతనికిఁ బుత్త్రులు మువ్వురు
సుతయొక్కతె కలిగి రందు స్తుతిమతి ప్రథముం
డతి ధర్మతత్పరుఁడు; సూ
నృతశీలి "ఋదీవరుండు" నిష్ఠితుఁడెందున్.

16

అతడు దీర్చు వేదవిధులన్నియు నిత్యము నగ్నిసాక్షిగా;
ప్రీతిని పేదవారలకుఁ బెట్టును దాను భుజింపకుండ; నే
నాతము గోరకుండ తగున్యాయము చెప్పు వివాదమందు; నా
రాతి యొకండులేని జనరంజకుఁడై కరుణాంతరంగుఁడై.

17

అతడు - తొలిభార్య లేత ప్రాయంబునందె
శమనమందిన - పెండ్లాడె "చంద్రమణి" ని
ఆమె యకలంకచరిత! సాధ్వీమతల్లి!
పార మెరుగని యనురాగ పాలవెల్లి!

18

పతియే దైవమటంచు నమ్మి పతిసేవాభాగ్యమే భాగ్య మం
చతి విశ్వాసముతోడ చంద్రమణి భార్యాధర్మముల్ దీర్చు సం
తతమున్ భర్తకుఁ బ్రేమపాత్రమయి; సీతారాములే యంచు దం
పతులన్ లోకులు ప్రస్తుతింతురు సదా ప్రామాణ్యదాంపత్యమున్.

19

అరిషడ్వర్గములన్ జయించి హరిపాదాబ్జార్చనాభక్తి త
త్పరుడై సత్యవచఃప్రసిద్ధుఁడయి దాంపత్యమ్ము రాజర్షిగా
నెరపున్; చంద్రమణీసతీమణియు నిర్నిద్రానురాగమ్ముతోఁ
జరియింపంగ; ఖుదీవరుండు సతమున్ సంతోషసంవర్ధియై

20

అతడు వచించు మాటలు యథార్థముగా ఫలియించు; వాని యో
గ్యతకు జనాళిమెచ్చి తమకైన వివాదము తెల్పి తీర్పుసం
గతి శిరసావహించెద రఖండధనంబు లొసంగినన్ గడున్
వెతల ఘటిల్లఁజేసినను వీడఁడు సత్యమనూనమోదమున్.

21

ధారిగ్రామము నేలుచుండిన జమీందారుండు వ్యాజ్యంబుకై
కోరన్ తప్పుడు సాక్ష్యమిమ్మనుచు; వారించెన్ ఖుదీరాముఁ డా
ఘోరంబెన్నఁడు చేయలేననుచు; నుగ్రుఁడైన దారిజమీం
దారుం డంత వచించె నిట్లు కడు నిర్దాక్షిణ్యమౌ వైఖరిన్.

22

" ఊరును వీడిపోవుటయొ నొక్కయసత్యము పల్కి నూరు దీ
నారములన్ గ్రహించుటయొ నర్మిలి వేగమ తేల్చుకొమ్ము; నీ
వారికి దూరమైన తరువాత సుఖంపడ గల్గుదే? విరా
ధారముగా మఱెచ్చటనొ దారసుతాదులఁ బెంచఁగల్గుదే?

23

తప్పకవచ్చి మాటజవదాటక నాకనుకూలసాక్ష్యమున్
చెప్పుము, నీదుకోరిక వచింపుము తీర్చెద, నట్లు కానిచో
తప్పదు నీకు ముప్పు; నిజదారసుతాదులు దక్కరియ్యెడన్
నిప్పను నీరు పుట్టవిక నీకు; గ్రహింపుము నిర్ణయింపుమా

24

తెలవారంగనె వెళ్ళగావలయు నేతెమ్మీవు నాతోడనే
కలకత్తానగరమ్ము; నీవచట సాక్ష్యంబిచ్చి నావ్యాజ్యమున్
గెలిపింపన్వలె, నీవు సాక్ష్యమిడ నింకేచర్చయున్ జేయ రీ
వల నీకర్థముగాదు; రేపుదయమే వత్తున్ బయల్దేరుమా."

25

అనుచు బెదరింపగ నసత్యమాడలేక
ప్రథమ పుత్రుడు పుత్రిక భార్యతోడ
రాత్రిపూటను జని ఖుదీరాముడపుడు
'ధారి' విడిచిపెట్టి 'కమర్పుకూరు' జేరె,

26

అచ్చటివారు మంచి మరియాద గలట్టి వివేకవంతు లా
పచ్చని గ్రామమందున నివాసము నేర్పడఁజేసి భక్తిమై
యిచ్చిరి నోరువిప్పి వచియింపక ముందె సమస్తవస్తువుల్,
మెచ్చిరి వారు సత్యమును మీరనివాని ఖుదీవరున్ గతున్.

27

ఆ కమర్పకూరున ప్రజలాదరింప
చంద్రమణితోడ నీశ్వరార్చనసమగ్న
మానసుండైన రాముడు మనసునొందె
దర్శనీయంబులైన క్షేత్రములు జూడ.

28

పాత్రతగల్గుదానము లవక్రతఁ జేయుచుఁ బుణ్యదంపతుల్
యాత్రలు సాగి పాపపరిహారములైన శుభస్థలుల్ కురు
క్షేత్రగయాప్రయాగములు కీర్తితముల్ దరిసించి మించుచున్
నేత్రసుపర్వమౌ నటుల నిశ్చలతన్గొని హర్షమొందగన్.

29

కడు పవిత్రమైన గయలోన నెలకొన్న
ఆదిదేవుఁడౌ గదాధరుండు
వారి కొక్కనాడు స్వప్నమున్ గనవచ్చి
కొడుకు నగుదు నంచుఁ గోరెఁదాను.

30

ఇరువురి కేకకాలమున నేకవిధంబగునట్టి స్వప్నమే
పరగుటఁజేసి దంపతులు పారమెరుంగని సంతసంబుతోఁ
దిరిగి గృహంబుజేరి యిలుదీర్చుచు వైష్ణవదీక్షబూని సా
దరముగ సాధుపుంగవులఁ దన్పుచు వేచిరి స్వప్నసిద్ధికై.

31

మోక్షగాముల హృదయముల్ మురుపుగాంచె
వనధు లుప్పొంగె లతలు పుష్పములు విరిసె
ఇలకుఁ బదునెక్కె గుండెలు పులకరించె
సుదతి కలపండ శుభవేళ చూలుదాల్చె.

32

ఆయింట వేదమ్ము లనిశమ్ము ఘోషించు
"సత్యమేవజయతి జయతి" యనుచు
ఆయింట శాస్త్రమ్ము లాజ్ఞాపనముచేయు
"ధర్మంచర" సమస్తకర్మ లనుచు
ఆయింట మానవతాయుమ్ము వివరించు
"ఆత్మవత్సర్వభూతాని" యనుచు
ఆయింట భారతీయత చాటు వేనోళ్ళ
"అతిథిదేవుండు విష్ణ్వంశ" యనుచు

అచట వినిపించు హరినామ మన్నివేళ
అచట లభియించు నకలంకమైన శాంతి
అచటఁ గలుగును మదికి నాధ్యాత్మకాంతి
అచటఁ బుట్టిన చిన్మైన ఆత్మఁదెలియు.

33

నవమాసంబులు నిండగ
నవగ్రహాము లుచ్చదశ ఘనంబుగ నుండన్
భవబంధంబులు త్రెంచిన
పవిత్రుఁ గనె చంద్రమశి శుభంకరుఁ బుత్రున్.

34

ఆత్మకారకుడైన ఆదిత్యు హోరలో
వేదాంతనిధిశని విమలదృష్టి
లలితకళామహోజ్వల విభావసుడైన
శుక్రున కుచ్చమౌ శుభనవాంశ
సకలవిద్యాదాన శక్తుండు గురునకు
భాసురమైనట్టి ద్వాదశాంశ
వాక్స్థానమగు బృహస్పతియింట శుక్రుండు
నుచ్చ యందుండుట యును గణించి

కేంద్రమున రవిబుధునితోఁ జంద్రుగలిసి
గురునివీక్షణమందుట; కుంభలగ్న
మగుట; మోక్షవిజ్ఞాన విద్యాధికులకు
ప్రవరుఁడని మెచ్చినారు దైవజ్ఞులతని.

35

అతఁడె "గదాధరుండు" గుడియందలి నల్లని రాతివిగ్రహం
బతివ పతివ్రతామహిమ మానవరూపము నందెనో యనన్
అతులిత రూపురేఖల శుభాంకములన్ విలసిల్లి బాలకుం
డితఁ డతిలోకతేజుఁడని యెల్లరు మెచ్చగ నవ్వునిచ్చలున్.

36

ఆ కమర్పుకూరు లోకవిఖ్యాతమై
తనర హేతువైన దంపతులకు
వంగభూమి తోడ పంచఖండంబులున్
నతులొనర్చె నేడు నుతులొనర్చు.

37

ధారిగ్రామ సీమ దక్కించుకోలేని
గౌరవము కమర్పుకూరు పొందె
ఊరనొకడు దుష్టుఁడున్నంత మాత్రాన
ఊరికెల్లఁ జెటు లొదవుగాదె.

38

ముద్దులు మూటగట్టు నగుమోమున బ్రహ్మము తాండవింప ము
ప్పొద్దులు మూడురూపుల నిరూపణ మౌచు విచిత్రలీలలన్
పెద్దలకెల్ల నచ్చెరువు పెంపెసలార త్రిమూర్తి మంతుఁడై
తద్దయు వృద్ధిగాంచెను గథాధరు డందరి కంటి వెల్గుగా.

39

రెండువత్సరముల ప్రియబాలకుని చూపు
చూడవచ్చువారి జాడ లరయు
మూడువత్సరముల ముద్దుకుర్రనినవ్వు
ఆత్మలోని మర్మ మాకళించు.

40

క్రమముగ నాలుగేండ్లుచనెఁ; గారణ జన్ముఁడు గావుటన్ ప్రపం
చము గణుతింపగా నుడువసాగెను తీయని తొక్కుపల్కులన్
శమదమసాధనంబులగు శాస్త్రవివృత్తులు గోపనమ్ముగా;
సుమముల జాతిభేదములు చొప్పడు పుట్టుకతోనె తావులన్.

41

అతని పంచాబ్దముల ప్రాయమందె తండ్రి
అక్షరాభ్యాస మొనరింప నచిరకాల
మందె చదువుట వ్రాయుటవబ్బె; గురువు
లబ్బురంపడి యతిలోకుఁ డనుచు మెచ్చు.

42

ఆరవయేటనుండి మనసారఁగ భాగవతమ్ము గాధలన్
భారత సంహితన్ వితతభక్తి రఘూద్వహు శీలవర్తనల్
నేరువఁజొచ్చె నిశ్చలమనీష సదా హరిదాసులొద్ద; సం
సారవిరాగులైన సువిచారుల బాల్యము లిట్టివేకదా!

43

అతఁడు సప్తాబ్దముల ప్రాయమందె మధుర
మంజులంబైన కలకంఠ మాలపించి
ఆలకించిన హరికథ లన్ని పాడు
అతని ధారణశక్తి అత్యద్భుతమ్ము.

44

పదుగురు బాలురంగలిసి భారత భాగవ తాది గాథలన్
ముదమున నాటకమ్ములుగ ముచ్చటగా నటియించి చూపుఁ దాఁ
జదువును సంధ్య మాని హరిసంస్మరణంబునుబూని " కానవై
నది సకలంబుమిధ్య! యిదినాటక " మంచు వచింప నేమొకో.

45

రమ్యగుణశీల మేనత్త " రామశీల "
దేవతావేశమును బొంద తృష్ణవొడమి
అట్టి భావమునొంద ననారతంబు
మథన పడసాగె తన్మార్గ మర్మమెరుఁగ.

46

ఏడవయేటఁ దండ్రి గతియింప గదాధరుఁడెంతయున్ మనో
తాడన మంది జన్మగత తంత్రములన్ దెలియంగఁ గోరి రా
పాడఁ దొడంగె నెమ్మదిని; భావిమహోన్నతతత్త్వవేత్తకా
కీడు సమస్తసృష్టిగత కీలకముల్ వివరించె నేమొకో.

47

మృత్తికతోడ దేవతల మేలురు విగ్రహముల్ రచించి స
ర్వోత్తమ శిల్పనైపుణి మహోద్ధతిఁ జూపిన బాల్యమందె ది
వ్యోత్తకళావిమం దనుచు నాతని యెన్నిక కోసమై జనం
బుత్తలమంది విగ్రహము లుత్సుకతన్ గొనివత్తు రయ్యెడన్.

48

ఎనిమిదేండ్ల బాలుఁ డనుమతింపనిచోట
దేవతలకుఁ గూడ తిండిలేదు
అతఁడు మెచ్చకుండ ప్రాణప్రతిష్ఠయే
లేదు విగ్రహముల కాదినముల.

49

తొమ్మిది వత్సరంబుల సుతుం డతిలోకునిభంగి నిత్యస
త్యమ్మగు ధర్మసూక్ష్మములు దావచియించుటఁ జూచి పెద్దవా
రిమ్ముగఁ జేరఁబిల్చి వివరింపఁగఁ గోరుదు రాత్మతత్త్వభా
వమ్ములు; దైవశక్తి కలవారలకున్ వయ సేమిచేసెడిన్.

50

పట్టుమని పదియేండ్లు లేనట్టివాఁడు
జుట్టు నరసిన వేదాంత సూరిజనుల
సందియము దీర్చు టెంత యాశ్చర్యకరము !
అవికదా ప్రవక్తల జీవితాద్భుతములు.

51

ఓరిమితోడ నెట్టులెటులో కడుగుట్టుగ ధైర్యమూని సం
సారము నీదుచున్న గుణశాంతుడు రామకుమారుఁ డగ్రజుం
డూరక కాలమున్ గడుపుచున్న సహోదరుఁ జూచి చింతతో
నారట మందసాగె నెటులైనను దమ్ముని( జక్కదిద్దగన్.

52

కలకత్తానగరమునం
గల కాళీభక్తురాలు గరితలసాధ్వీ
తిలకము రాస్మణి తనకున్
గలలో సెలవీయ మాత కట్టింపగుడిన్.

53

ఆచంద్రార్కము కాళికాజనని భక్తానందమున్ గూర్పగా
ప్రాచుర్యంబుగ దక్షిణేశ్వరమునన్ భక్తిన్ గుడిన్ గట్టి లో
కాచారమ్ముగ రాంకుమారు నట వేడ్కన్ బంచెఁ బూజారిగా
వైచక్షణ్యము గల్గి కాళికకు సేవల్ జేయ మోదమ్ముతో.

54

అన్న పడుబాధ లన్నియు నన్నమునకె
ఆత్మకోసముగాదని ఆకళించి
తత్త్వ మెరుగంగఁ గోరి గదాధరుండు
మౌనమును బూనె ధ్యాన నిమగ్నుడగుచు.

55

జపములఁ బూజలన్ మునిగి సత్త్వపదార్థము భంగి నుండగా
నుపనయనం బొనర్చి తన యొద్దకు దోడ్కొనిపోయి తమ్మునిన్
గృపఁ జదివింపసాగె విజిగీషను రామకుమారుఁ డాసతో
నపఘనభోగదాయకము లైన కువిద్యల జీవనార్థమై.

56

పాఠశాలయందు పాఠ్యపుస్తక మందు
గురువు నందు వర్ణగుణిత మందు
మనసు నిలుపలేక మదిని మార్చగలేక
తలఁకసాఁగె నా గదాధరుండు.

57

పదియారేడుల బాలతాపసికి విశ్వాసమ్ము లేదయ్యె నా
చదువుల్ దేవుని దెల్పునంచు; భవపాశవ్రాతమున్ ద్రెంచి స
మ్మదమున్ గూర్చెడి విద్యనేర్తునని సంపూర్ణాత్మదీక్షారతిన్
వదలెన్ సంస్కృతపాఠశాల తొలిశబ్దంబేని రాకుండగన్.

58

చదువు సంధ్యమాని సర్వేశ్వరుని బూని
మాట చూపు మరచి మౌని యగుచు
రామకృష్ణులందుఁ బ్రేమ గదాధరుఁ
డలరె " రామకృష్ణుఁ " డనఁగ జనులు.

59

" చదువా ? రా దొకపూట బత్తెమునకున్ సంపాదనా? లేదు నీ
హృదయాం బర్థము కాదునాకు; బ్రతు కేరీతిన్ బ్రమాణింతువో
తుదకేమయ్యెడొ! నేను వేరొకట నుద్యోగంబు గావింతు; నా
బదు లీవేగుము నిత్యమున్ గుడికి లోపంబేమి రాకుండగన్

60

అని రామకుమారుండన
విని మోదము నొంది గుడికి వెడలందొడంగెన్
చినరామకృష్ణుఁ డటుపై
తనతల్లిని జేరు ముద్దు తనయుని భంగిన్

61

ఆలయమందు గాలిడిన యట్టి ముహూర్తమునుండి తల్లి కెం
గేలున నన్ను బిడ్డవలె కిమ్మనకుండ సమాధినిష్ఠుఁడై
ప్రీలని భక్తితోడ నొనరించుచునుండె తపమ్ము కాళికన్
మాలిమిఁ గన్నులారఁగన మానసమందున తృష్ణ పుట్టగాన్

62

" ప్రజల దుఃఖంబులను మాన్ప వచ్చినట్టి
భద్రకాళీ! మహాతల్లి! భవ్యచరిత!
అమ్మ! మాటాడుదువ లేద? " అనుచు నడుగు
ధైర్య మెవ్వని కబ్బె నాతనికిఁగాక ?

63

క్రమముగ కాళికాచరణకంజమరందనితాంతపాన స
ద్భ్రమరమునయ్యెడి యడుగు "తల్లిరో! నామొర లాలకింపవే!
ప్రమదము గూర్పవేగఁ గనరావె!" యటంచు నహర్నిశంబు దీ
నముగ; జనాళి వానిఁగని నమ్మిరి నిక్కము పిచ్చివాఁడుగాన్

64

ఎవరి పిచ్చి వారి కింపన్న రీతిగా
ఆతఁడుండు తపసు నందు మునిఁగి
అతఁడు పిచ్చివాడటంచు లోకులు నవ్వ
నరులఁ జూచి కాళి నవ్వుకొనును.

65

వాత్సల్యంబును దివ్యమౌ మధుర భావారాధనన్ సాధనన్
దైవంబున్ నిరతంబుఁ గొల్చుమదిఁ దద్రూపముల్ నిల్పుచున్
సేవాభావము మాతృభావమును సంస్నేహమ్ము ప్రేమాది ర
మ్యావాహంబుల నాతఁడెల్లపుడు దివ్యావేశయోగస్థితిన్

66

భావమున దైవవివిధరూపములు దలచి
తదనుగుణముగాఁ దాను వస్త్రములు దాల్చి
మధుర సంకీర్తనా గాన సుధలు జిల్కి
నృత్యమొనరించు నమ్మ సన్నిధి నతండు

67

ఒకసారి భృత్యుఁడై ఒదిగి సేవలు చేయు
ప్రహ్లాదబాలుఁడై భక్తిదనర
ఒకసారి తల్లియై ఒగి బుజ్జగించుఁ దా
శబరిమాత యగుచు సంతసమున
ఒకసారి మిత్రుఁడై ఒకటిగాఁ జరియించు
అర్జునుం డగుచు ప్రియంబుతోడ
ఒకసారి పత్నియై ఒయ్యారములు చూపు
రాధ తానగుచు మారాముచేసి

రామకృష్ణుఁడు పరమాత్మఁ బ్రేమతోడ
నెట్లు పిలిచిన భగవానుఁ డట్లు పలుకు
పిలుచువాఁడును – ఆలించి పలుకు వాఁడు
ఒక్కఁడేయైనఁ బేరేమి చిక్కుదెచ్చు?

68

పనిఁయు బాటు లేదు పనికిరాఁ డనినాఁడు
లోని గుట్టు తెలియ లేనివారు
పెదవి విప్పడితఁడు పిచ్చివాఁడనినాఁడో
కనులఁ గాక చెవుల మనెడువాఁడు

69

పెండ్లి చేయ సతిని పెంచలే దనినారు
ఆడపిల్ల తండ్రులైన వారు
కట్టుకొన్న పడతి యెట్టులు వేగునో
పాప మనిరి ఆడపడుచు లెల్ల.

70

రాతి బొమ్మ యెదుట రాగాలు తీయుట
భక్తి కాదు పిచ్చి వాగు డనిరి
తనను జూచి నవ్వ దరివారిఁ గనియేడ్చు
అతని వెర్రి ముదిరె ననిరి జనులు.

71

పాటపాడ శిలలు పరవశించునె యంచు
పరిహసించినారు పండితులును
భజనచేయ రాళ్లు వరమిచ్చునా యంచు
బ్రతుకు జూడు మనిరి బంధుజనులు

72

పెండ్లియైనగాని పిచ్చికుదరదని
పిల్లకొరకు వెదుకఁ బెద్దవారు
రామచంద్రుపట్టి రమణి శారద తన
భార్య యగు నటంచుఁ బలికె నతఁడు

73

ఆతనిమాట కేమియని; యైనను జూత మటంచుఁ బెద్దలా
రీతిగఁబోయి వాని వివరించిన వన్ని యథాతథమ్ముగా
ప్రీతిగఁజూచి యబ్బురము పెంపెపలారఁగ రామచంద్ర వి
ఖ్యాతునిఁ గోరినంత నతడర్మిలి శారద నిత్తునంచనెన్

74

పరమహంస శబ్దపరమార్థమునుజాటు
నర్థమయ్యె శారదార్ధభాగ
మమరపరిమళమ్ము లమరె భక్తిసుమాల
కాళికాసవిత్రి కరుణవలన

75

ఇరువదిమూడువత్సరములేగిన జవ్వనుఁడైనఁగాని తా
నరువదియేండ్లవృద్ధువలె నన్నిసుఖంబులుఁరోసి పెండ్లికిన్
కర మనుకూలుఁడౌట త్రిజగంబుల మున్నెటలేనివింత భా
సురముగఁ జూపసేమొ! కడుచోద్యములేమి ప్రభావితమ్ములో

76

శారదాబాల యేడేండ్లు మీరనపుడె
భర్తపదములు కడిగి సద్భక్తితోడ
వందనముచేయ పెద్దలానందమంది
రదికదా ప్రణయాత్మరాగాంకితమ్ము!

77

పెండ్లి ముగియగానె వెనుకకుఁ జనుదెంచి
ఆలయమ్ములోన ప్రాలెనతఁడు
గోవు విడిచియున్న గోవత్సమును బోలి
అవురావురనుచు నమ్మదరిని

78

ఆలయమే ప్రపంచముగ నమ్మయె సర్వముగా త్రికాలముల్
మాలిమితోడ సేవలు సమస్తము చేయుచు సృష్టికంతకున్
మూలపదార్థమేదియని మోక్షముపొందుటయెట్టులంచు నా
భీలముతో తపించి విలపింపగసాగె నతండు నెమ్మదిన్

79

కడలి తరగలు కాలచక్ర మొకని కయి
అగవనురీతి కాలమ్ము సాగిపోవ
అతని చిరకాల వాంఛ సన్యాసము గొన
బయలుపడె తీవ్రదీక్షానిబద్ధి యగుచు

80

గ్రాసము కోసమై యెరుపు రంగును బట్టలకద్ది కూళస
న్యాసులు మోసపోదు రిల నాకలి తీరిన చాలటంచు; స
న్యాసము త్యాగమున్ దెలుపు నంతిమవాసము దివ్యజీవనా
భ్యాసము లోకవాసనలు పట్టని వేషము దైవరాసమున్

81

కాషాయవస్త్రమ్ము గట్టి సారాపాక
పావనం బొనరించు వాఁడొకండు

దండము నాని రుద్రాక్షలు చేఁబూని
వనితకై జపియించు వాఁడొకండు

ఒడలెల్ల భస్మమ్ము నిడుకొని గంజాయి
పట్టులో స్మృతితప్పు వాఁడొకండు

గడ్డమ్ము మీసమ్ము కటిదింపి కరలాఘ
వముచేసి జీవించు వాఁడొకండు

ఇంక నెన్నెన్నొ వేషమ్ములిడి పవిత్ర
మైన సన్యాసమును మానహీనముగను
జేసి జీవించు కూళసన్యాసివరులఁ
గాంచి రామకృష్ణుఁడు విచారించె మిగుల

82

" సన్యసింపవలయు జనులకు త్యాగమ్ము
నేర్పు కొరకుఁ గాంక్ష లార్పు కొరకు "
అనుచు రామకృష్ణుఁ డాలోచనముచేయు
నంతలోన వచ్చె నతిథి యొకడు

83

ఆతడు "తోతాపురి" వి
ఖ్యాతుండు; దిగంబరుండు గావుట నతనిన్
ప్రీతి "దిగంబరుఁ" డందురు
పీత కుచేలుడు; విషయవిభీషనుఁ డరయన్

84

హరినామస్మరణానురక్తుఁడును యాత్రాఘూర్ణనాదర్శిః సు
స్థిరనారాయణపాదపద్మయుగళీచింతామృతాస్వాదసం
భరితుండైన దిగంబరుండు తనకున్ బ్రహ్మోపదేశంబు చే
య రహిన్ మించెను రామకృష్ణుఁడును దివ్యజ్ఞానతేజస్వియై

85

అనితరసాధ్యమై కడుభయంకరమై యనుతాపవేదనా
జనకములై మహాత్ములకు నైతము తుచ్ఛములైన భోగచా
దన మొనరించి దుర్గతుల దాపొనరించెడి "వీరభావసా
ధనలు" జయప్రదంబుగ నితాంతము చేసెను నాతడయ్యెడన్

86

జపము తపము యోగసాధనమ్ములుచేసి
మంత్రతంత్రకర్మ మర్మమెరిఁగి
యద్భుతములుచూపి యానంద పడలేక
అమ్మఁజూడ నాతఁ డాత్రపడును

87

అరువదినాల్గు తాంత్రికములందు సమగ్రవిజేతయై మనః
పరిణతి నొంది "లోకమున భామినులందరు తల్లులే; మనో
హరమగు స్త్రీశరీరమున నద్దమునంబలెఁ గాంతు దైవమున్
పరమపవిత్ర మాతనువు బాపురె" యంచు నతండు మెచ్చెడిన్

88

సర్వమెఱింగి తుదిని "నిర్వికల్పసమాధి"
సైతమభ్యసించి "సత్త్వ" మైన
రామకృష్ణుఁగాంచి ప్రేమతో నుప్పొంగి
గణుతిఁ జేసె నా దిగంబరుండు

89

నలుబదివత్సరంబులు ఘనంబుగ సాధనజేసి నేను మి
క్కిలి శ్రమనొందియున్ దుదకు ఖిన్నుడనైతిని నిర్వికల్పమున్
దెలియఁగలేక; నీఘనుఁడు దేవునిమూర్తియ! గాకయున్న కే
వలముగ మానవుండు గనవచ్చునె దానిని మూడునాళ్ళలో!

90

"రాజితాభోగతత్త్వసర్వజ్ఞు డితడు
పుణ్యజీవనధర్మసంపూర్ణు డితడు
సాత్త్వికాకాశనిత్యభాస్వంతు డితడు
మానవాకారమున భగవాను డితడు"

91

అని సద్భక్తి వి। రామకృష్ణునకు సాష్టాంగప్రణామమ్ము చే
యను నుంకించిన యాదిగంబరుని నాప్యాయమ్ముగా నాపి యి
ట్లనె రాముండు "గుహూత్తముల్ దమరు నాయందునన్ గృపాదృష్టిం జూ
పినం గాదే లభియించె నాకు నిది సంప్రీతుండ నేనెంతయున్ "

92

నావుడాతండనియె భావమ్ము మెరయంగా
" కల్పమేమి నిర్వికల్పమేమి ?
నిఖిలమందు నీవు నీలోన నిఖిలంబు
లీన మగుచునుండ నేనెవండ ? "

93

అంతట రామకృష్ణుండనె నర్మిలి " శాస్త్రవిధుల్ ప్రపంచమున్
సంతనజేయంగావలయు; సద్గురు సేవను చేయు మానవుం
డెంతయు వృద్ధినొందునని యెల్లరకున్ దెలియంగంజెప్ప మి
మ్మెంతును నాగురుండనుచు నెల్లపు డంచితభక్తిభావమున్

94

గురువునందు భక్తి కొరవడినంతనే
నరుని యాత్మ బలము తరిగిపోవు
ఆత్మబలము లేని యధముండు మనుజుండే ?
నరుని రూపు నున్న ఖరముగాక ! "

95

అని యకలంకభక్తి - పరమాత్ముఁడు భక్తికి లొంగునట్లు - నా
తని చరణంబులంటి తలదాల్చెను శిష్యుడు రామకృష్ణుకున్
వినయము సద్వివేకమును విజ్ఞత మువ్విరిచెంద; నీశ్వరుం
డనవరతంబు మానవుల కాచరణీయము నేర్పఁ బుట్టెడిన్

96

పరమహంస తాను బ్రహ్మసాక్షాత్కార
మందు లేమి తానె అతడైన
అయిన నరులకెల్ల నాదర్శమూర్తియై
తనరఁగాదె తాను తపసియగుట

97

ఆకలి దప్పులు నిద్రయు
లేకుండగ తల్లిముందు లీలాత్ముండై
ప్రాకట సమాధి నుండగ
నాకర్ణిత మగును వాని కమృతమయోక్తుల్

98

ప్రతిదినమందు నాతఁడటు భావసమాధిని అమ్మతో సమం
చితమగు తత్త్వమున్ దెలియ చిన్మయవృత్తిని చర్చఁజేసి సం
గతి విశదంబుగాఁ దెలిసి కన్నులఁ జూడఁగ నమ్మరూపమున్
గుతుకము హెచ్చి కాళి నడుగున్ బతిమాలును దర్శనంబుకై

99

అమ్మను జూడగ బ్రత్య
క్షమ్ముగ; దేవళము వెనుకఁ గల కీకార
ణ్యమ్మునకున్ వెడల నిశీ
థమ్మున; హృదయుండు గాంచి తర్కించె నిటుల్

100

" అర్ధరాత్రివేళ నడవికిఁ జని దిగం
బరుడవై చరింతు వరయఁ దుదకు
అతి పవిత్రమైన యజ్ఞోపవీతమ్ము
నేని యుంచుకొన వదెందువలన ? "

101

అన విని రామకృష్ణుడు సుహాసము చేయుచు వాని కిట్లనెన్
మనుజునిబంధముల్ వలువమాత్రముగా మొదలై కళత్రమున్
ధనమును బిడ్డపాపలని దట్టములై పెనుకోనయై మహా
వనమయి అంధకారమున వైచును; మార్గము కానరాదికన్

102

కావున బట్టలోనె మమకారవిసర్జన ప్రోది కావలెన్
వావిరి సర్వసంగపరివాపనమున్ బొనరించుకోవలెన్
ఈవిధి నంధకాననవిజృంభణమాపి తరించి స్వేచ్ఛమై
పావనతత్త్వతేజమున బ్రహ్మము గానఁగవచ్చు నిమ్మయిన్

103

జంధ్యమున్న యెడల జనియించు గర్వంబు
అగ్రకులము వాడ ననుచుమదిని
కుండలన్ని మట్టికూటమ్ములే యైన
రంగువేయఁ గొన్ని రజితమగునె ?"

104

అని వివరింప నాహృదయుఁ డచ్చెరువంది తలూచి రామకృ
ష్ణుని యభిలాష వాని వయసున్‌గని మ్రొక్కెను "ఖావికాలమం
దున సకలార్తదీనజనదుఃఖము బాప సమర్థుడంచు; దే
వుని యవతార మంచు" వెలవోవునె పైడి రవంత కల్గినన్

105

అమ్మఁజూడ కాంక్ష యధికమ్ముకాజొచ్చె
కానవచ్చు నాశ కానరాదు
తల్లి కొరకు నేడ్చు పిల్లవాని వలెను
కుమలపాగె సతము కూకలిడుచు

106

"ఎన్నాళ్లగినఁగాని అమ్మ కనరాదేనింక నాతల్లి నీ
కన్నుల్ జూడఁగ జాలుదో విజితమోక్షంబబ్బునోలేదొ! యిం
కెన్నాళ్ళు దరిలేని యాతన" యటం చెల్గెత్తి యేడ్చున్ సదా
తన్నుం జూచిన వారు పిచ్చియని సంభ్రాపమ్ముతో నవ్వగన్

107

అమ్మ కనబడకుండ నిరాశ నతడు
బ్రతుకుఁజాలింప నెంచి దేవళముఁజొచ్చి
ఎదురుగానున్న విగ్రహ మెదుటనిల్చి
అడిగె నాతల్లి గుండియ లదర నిట్లు

108

" నిత్యంబాకృతిఁగుండలిన్నిలిపి ధ్యానింతున్ నినున్గానఁగా
ప్రత్యక్షమ్ముగ నైన నీవు కనరావా తల్లి? నీవుండుచే
సత్యం బైనచొ దర్శనంబిడు మభీష్టావాప్తిగా; లేనిచో
భృత్యుండింక భరింపలేడు జననీ! బేతాళసంహారిణీ!

109

నీవున్నావను నమ్మకమ్మునగదా నేనుంటి నిచ్చోట నీ
సేవల్ జేయుచు రాత్రియున్ బవలు తుష్టిన్ జేసి పూజారినై
నైవేద్యంబిడి! లోపముల్ గలవొకో నాపూజలో? దర్శనం
బీవే తల్లి! దయామయీ! వరద! రావే! నన్ గటాక్షింపవే

110

జననీ! పాపవినాశనీ! సకలశిష్టవ్రాతసంవర్ధినీ!
ఘనవాత్సల్యసుధాతరంగితధునీ! కళ్యాణసంధాయినీ!
మనుజోత్తంసహృదంతరోష్మక కృపామందాకినీ! పావనీ!
అనఘప్రాక్తన దివ్యశక్తి! జననీ! ఆపన్నదీనావనీ!

## 111

ప్రళయరౌద్రాకారవదనమ్ములో శాంత
విన్యాసచంద్రికల్ వెలుగవలయు
రక్తారుణజ్వాల రగులు కన్నులం ప్రేమ
గంగాప్రవాహ ముప్పొంగవలయు
భీకరదౌంష్ట్రగంభీరమౌ పెదవిపై
చిరునవ్వు మల్లియల్ విరియవలయు
సర్వవినాశవశక్తిస్వరూపమున్
మాతృదేవత రూపు మలచవలయు

అట్టి - కరుణామృతము రూపునందినట్టి -
ఆకృతివి వేగ నాకుం బ్రత్యక్షమగుము
లేనిచో నీదు పాదమ్ము లాన నిదిగొ
శిరము బలిసేతు వేరొక చింతలేదు "

## 112

అనుచుం గాళిక దక్షిణహస్తమందు
కలుగు కరవాలమునుగొని కంఠసీమ
నేయులోపల సకలప్రకృతి యుగాంత
కాలజాజ్వల్యమానమౌ కాంతిమునింగె

113

కోటిసూర్యులు కోటానుకోట్లచంద్రు
లొక్కసారిగ నచ్చోట నుద్భవించి
నట్లు దుర్నిరీక్ష్యము దుస్సహమగుకాంతి
తేజరిల్లంగ నాతండు తెలివితప్పె

114

ఆ తేజము క్రమముగఁ బ్రో
వై తనరెను; దిశలమెరుపు లద్భుతరీతిన్
నాతుకరూపముఁ గొనినటు;
లాతడు దర్శించె నంత నమ్మను ముదమున్

115

ముగ్గురయ్యలఁ గన్నట్టి ముసలివగ్గు
పదియునారేండ్ల నిత్యయౌవనవిలాసి
మూడుజగములఁ బాలించు మూలశక్తి
భక్తిబంధంబునకుఁ గట్టువడిన దేవి!

116

జంగమస్థావరంబైన జగతినెల్ల
సృష్టియొనరించి పోషించి నష్టపరుచు
ఆదిమధ్యాంతరహిత మైనట్టిశక్తి
అతఁడు కోరినరూపమ్ము నావహించి

## 117

నీలమేఘపుడాలు డీలు సేయఁగఁజాలు
కమనీయకలిత విగ్రహముతోడ
బాలసూర్యప్రభాపటలమ్ము నిరసించు
కర్ణకుండలయుగ్మకమ్ముతోడ
స్వర్గంగ కెరటాల చల్లదనంబెల్ల
ప్రసరింపఁజేయు నేత్రములతోడ
రాకేందుచంద్రికాశ్రీకరం బగునట్టి
నయగారముల చిరునవ్వుతోడ
దక్షిణ కరాన నభయముద్రనుఘటించి
వామ కరమున జ్ఞానదీపము ధరించి
అంధకారమ్ములోఁజిక్కి యలమటించు
తనయుఁ గాపాడ వచ్చిన తల్లివోలె

## 118

అతని యెదుటను ప్రత్యక్షమై దయార్ద్ర
హృదయముప్పొంగ నాతని యెదనుదాకి
అనునయించెను గారాల ననుఁగుపట్టి
తల్లి లాలించు విధమున నుల్లసిల్లి

## 119

దేవీసాక్షాత్కారము
గావుటతో నతడు దివ్యగంభీర "మహా
భావోన్మాదము" నొందెను
ప్రావృణ్ణీరదముచెంత బర్హి విధంబున్

## 120

మానసకాసారమహితప్రశాంతమ్ము
ధ్యాన "శరస్సార" మానసమ్ము
హిందూమహార్ణవహేలగంభీరమ్ము
స్థిత "మహాభావ" ముద్రితముఖమ్ము
నవనవోన్మేషమందారసంస్నిగ్ధమ్ము
"ఈషణత్రయవిముక్తి" క్షణమ్ము
పూర్ణేందుచంద్రికాస్ఫురణమనోజ్ఞమ్ము
"దమశమా" న్వితమందస్మితమ్ము

అతని భావసమాధి. దివ్యార్షగతము
జీవపరమాత్మ లొకటియై చెన్నుమీరి
సాంఖ్యదర్శనహర్షణషాడబమున
ఒరిమ లోలోనవర్తించు యోగమదియ!

## 121

అప్పటినుండి తల్లియొడియందలి ముద్దుల చంటిపాపడై
ఒప్పరికించు "నీజగము నున్నది సర్వము మిధ్య; సత్యమున్
గప్పిన చీకటుల్ దొలఁగఁ గచ్ఛపమట్టులు లోనిచూపుతో
నెప్పుడు దైవచింతనము నింద్రియ నిగ్రహమును" మంచెదన్

## 122

అతడు దగ్గఁరజేర నమ్మ దేహము మాతృ
వాత్సల్యమున గగుర్పాటునొందు
అతడమ్మ యనిబిల్వ నమ్మగుండెలలోన
ప్రేమ పొంగి కనులు తేమయగును
అతడు మాటాడిన అమ్మతాటంకముల్
కలిత సంభ్రమమునఁ దళుకుమనును
అతడు గారముచేయ నమ్మపెదవులపై
చిరునవ్వు దొంతరల్ విరియఁబూచు

అతడు లేనివేళ నమ్మకు గుడిలోన
దివ్వె యున్నఁ దమమె నివ్వటిల్లు
అతడున్నవేళ నమ్మకు గుడిలోన
కానవచ్చు నట జగంబులెల్ల

123

యోగసమాధిలో జనని యొద్దను గారముచేయు ముద్దుబి
డ్డాగడ మింతయంచుఁ దెలియంగనురాదు; కుమారుకోర్కెపై
యోగినియై సమస్తవిధయోగరహస్యవిధానముల్ క్రియల్
ఆగమధర్మతత్త్వపథ మంతయుఁ దెల్పెను గాళికాంబతాన్

124

అంత నాతనిమనసు విశ్వాంతరాళ
మట్టు లవధులు లేకుండ నధిగమించె
ఆ మహోన్నతభావ సమైక్యమందు
సృష్టి యెల్ల నొకటిగ భాసిల్లి తనరె

125

" అమ్మకు నీకు నాకు జగమందలి యెవ్వరికైనఁగాని భే
దమ్మొకయింతలేదు; భవతారకమైనది సత్యమొక్కఁడే
క్రమ్మిన చీకటుల్ దొలఁగ క్రమమనోహరదివ్యతేజమున్
నెమ్మనమందుఁజూడఁ గమనీయముగాఁగనుపించు నొక్కఁడై "

126

అనుచు నెల్లరినొకటిగా గనును జగతి
ప్రాణులన్ని నారాయణప్రతిమలనుచు
సర్వసౌభ్రాత్రమును, మతసామరస్య
మును, పరాకాష్ఠ నంద నెమ్మనమునందు

127

ఇట్టులు గొన్నినాళ్లు గతియింపగ వందలు వేలుగా జనుల్
జట్టులుకట్టి వచ్చి వినసాగిరి వాని సుధామయోక్తులన్
అట్టివి పూర్వపుణ్యఫలమంచును; జేసిన పాపముల్ తుదన్
ముట్టగ మార్గమంచు నతిమోదముతోఁ బరమార్థచింతతో

128

ధరణిగుండెలుమండ తరుషండములు నెండ
గ్రీష్మమ్ము నిప్పుల క్రియ దహించె
నదులెల్లనుపొంగ నగములుకరుగంగ
వర్షర్తు వటుపైన వరదముంచె
మిధునమ్ములలరింప మధువు పువ్వులనింప
శరదృతు వరుదెంచి మురుపునించె
వృద్ధులు భయమొంద విరహిణులును గుంద
హేమంత మేతెంచి హెచ్చరించె

వృక్షములు మోడులై నిల్వ వెన్నెలలకు
బురదయింకఁగ శిశిర మేపునగతించె
ప్రకృతి రాగరంజితమై ప్రభావితమ్ము
కాగ సరసమ్ముగ వసంత మేగుదెంచె

129

రాగము పల్లవింప ననురాగము తీగలుసాగ గుండెలో
దాగిన ముగ్ధవాంఛలు విధాన పరాగము పండిపోవ; లో
మూగిన తాపముల్ మధురమంజులవాసనలట్లుగా వసం
తాగమనమ్ము తెల్పిరి లతాంగన లయ్యెడ పుష్పధారణన్

130

హాయిగనిద్రపోవజగమంతయు; చేరువ గున్నమావిపై
కోయిలకన్నెకూయ మదిఁ గోరిక లీరికలెత్త పద్మినుల్
తీయని బాధరేగి తియతీపులచిత్తము కోతవెట్టగా
పాయనికాంక్షతో వలపుభారముమోయు వసంతరాత్రులన్

131

భర్తకు దూరమై బ్రతుకు భార్యమనోవ్యథ నిర్వచింపగా
నేర్తురె యాదిశేషుడును నీరజగర్భుడునైత మెన్నగా
భర్తలు రాగబంధమున భార్యలకై విలపింత్రుగాని యే
భర్తయు భార్యడెందమునఁ బ్రాపగుబాధ గ్రహింపలేడిలన్

132

కాలముసాగిపోయె మమకారపు పంటయు నూత్నయౌవనో
త్తాలయు; భర్తృదర్శనసుధాపరితప్తపిపాసియున్ శమః
పాలిత యైన శారద విభాజిత జీవనమోర్వలేక వ్యా
లోలముజెందె మిక్కిలి విలోమముతోఁ బతిపాదసేవకై

133

అతడు సంకల్పసిద్ధుడై యలరువేళ
ఆమె షోడశాబ్దముల ప్రాయమునుబొందె
ఆత డిహవాంఛలకు దూరమైనపిదప
ఆమె పతిపాదములజేర నభిలషించె

134

“పతికి సపర్యచేయగల భాగ్యము నాకెపుడబ్బునో! వివా
హితకు మగండుకన్న మరి యెక్కువయేమి ప్రపంచమందు ? జీ
వితపరమార్థమున్ గనెడు వేళది యెప్పుడు వచ్చునో" యటం
చతివగ(జెంది శారద నితాంతము చింతిలు నెమ్మనమ్మునన్

135

రామకృష్ణుడు తలపునరాగ నామె
వాలుగన్నులలో మాతాబాలువెలుగు
మగనిదరిజేరు దనుమాట మదినిపొడమ
పాలబుగ్గలపై గులాబీలు పూయు

136

ఎప్పటినుండియో దయితు డీక్షణమం దరుదెంచు నీక్షణం
బిప్పుడె యిప్పుడే యనుచు నెప్పటికప్పుడు శారదాంబ తా
నిప్పులమీద నున్నటులు నీరును నన్నము మాని కంటిపై
రెప్పనువేయకుండ ప్రసరించును దారులవెంట చూపులన్

137

ఎంతకాలమ్ము గడిచినఁ గాంతకొరకు
రామకృష్ణుఁడు తలపక రాకయుంట
కూతుతోబాటు తండ్రియుఁ గుమలసాగె
వయసువచ్చిన కూతురు వాంఛనెరిఁగి

138

కట్టుకొన్నట్టివానికిఁ బట్టకున్న
నిల్లడమిడిన కూతున కీడువచ్చి
పుట్టినింటనె పడియుండునట్టిబాధ
ఆడపిల్లల తండ్రికే యర్ధమగును

139

అత్తవారింటికేఁగి గృహంబుతీర్చి
భర్తతోఁ బాలుతేనెయుఁ బగిదిఁ గలిసి
కాపురముచేయు కూతును గాంచినపుడె
తండ్రి తనకష్టము మరిచి తనియగలడు

140

ఎంతగారమ్ముగాఁ బెంచి యెన్ని సంప
దల నొసంగినఁ గూతుండ్రు తనియలేరు
భర్త యనురాగమందక బ్రతుకలేరు
దాని నెటులిత్తురే తండ్రులైనగాని ?

## 141

కన్నులు కాయలై మనసు గాలముఁ జిక్కిన చేపపిల్లయై
తిన్నగ భర్తకై యెదురుతెన్నులు జూచెడి శారదాంబ యా
పన్నతనొందెఁ జెంతఁగలవారలు వీరలు నమ్మలక్క లె
వ్వెన్నొ వదంతులాడ విని యేమియు నేర్పరచంగఁజాలమిన్

## 142

తనభర్త కాశికాజననితో మాటాడు
నని విన్న సంతోషమునఁ గరంగి
తనప్రాణపతి పిచ్చితనమునఁ జరియించు
నని విన్నఁ గొడుదుఃఖమున చలించి
తననాథుఁ డెనలేని తాపసపుంగవుఁ
డని విన్న నాశ్చర్యమునఁ బెణంగి
తనపతి తననింక ధర్మపత్నిగ నొల్ల
డని విన్న పెనుభయమునఁ దపించి

నిరతమును వేడ్క దుఃఖ మచ్చెరువు భయము
లొక్కపెట్టున నుక్కిరిబిక్కిరిగను
మానసమ్మునఁ బెనగొన మథనపడుచు
పతిని జేరంగ శారద పయనమాయె

143

జనకుడు వెంటరాగఁ జనసాగెను కాల్నడకన్ సుదూరమౌ
యెనుబదిమైళ్ళదూరము నిజేశుని సన్నిధిఁజేరు కౌతుకం
బినుమడినొంది; కాని తరళేక్షణ! ముగ్ధ! సుమాంగి! మధ్యలో
దను వసివాడగా జ్వరవితంసములోఁబడిపోయె నొక్కెడన్

144

మిక్కిలిప్రేమ నొక్క గృహమేధి సమాదరణంబుచేయ వా
రక్కడనుండి రాదివస మానిసిరాతిరి శారదాంబ తా
నక్కజమందఁగాంచె నొకయద్భుతమౌకల; నందుఁలోగనెన్
జక్కనిదానిఁ గెంపెదవిఁ జల్లని నవ్వులుచిందు మానినిన్

145

నల్లనిమేను పద్మనయనంబులు తెల్లని చీర యల్లనన్
ఘల్లనిమ్రోగు మట్టెలును క్రమనినాదముచేయుగాజు లా
త్ఫుల్లవిశాలఫాలమున ముద్దుగ దిద్దిన కుంకుమమ్ముతో
నల్లన నవ్వుచున్ దనకు నర్మిలి సేవలుచేయుచుండుటన్

146

కని విభ్రాంతిని శారద
అనియెన్ గౌతూహలంబునందిన స్వరమున్
వినయముగా "తల్లి! వం
దనమమ్మా! ఎవరునీవు? దయఁదెలిపెదవే?"

147

అంతట నా తలోదరి సహాసముచేయుచుఁ జెప్పెనిట్లు "ని
శ్చింతగ నుండుమమ్మ ! పతిఁజేరుదు వెల్లిదివాంతవేళ నీ
కింతభయంబులేదు, జ్వరమింకఁ దొలంగును; రామకృష్ణుడే
సాంతమెరింగి నీకుఁ బరిచర్యలుచేయఁగఁ బంపె నన్నిటన్

148

"అటులా? యైనచొ వారు క్షేమమని నేనాశింతు" "ముమ్మాటికిన్"
"ఇట నేనుంటినటంచు నెట్లుతెలిసెన్?" "హృద్వైద్యకవేద్యంబుతో"
"మటుమాయాయిది ? వావి కేమగుదువమ్మా నాకు?" "నేనమ్మనే"
"ఎటులో చెప్పుము! వారికేమగుదు?" "నీకేమౌదునోయంతియే"

149

"అత్తకు నమ్మకున్ నడుమ నంతర మేమియు లేకపోవుటన్
చిత్తము పల్లవింప దయఁచెప్పితివమ్మ నటంచు నాకుఁ గూ
డి త్తరిఁ జిక్కుకొంటి నెటులేగుదు? పాడుజ్వరంబు దారిలో
నుత్తలమందఁజేసె నెటులున్నదొ నానొసటన్ దయామయీ! "

150

" కాదు – మీయిద్దరకు నమ్మనౌదు నేను
దాని యర్థముతెల్పు నాతండు వెళ్ళ
జ్వరము లేదింకనీకు స్వస్థత లభించె
క్షేమముగ నీవు నాతనిఁ జేరఁగలవు "

151

ఆమాటలు ముగియుటతో
భామామణి తెలివినొంది పైకొను వింతన్
ధీమసమునఁ బయనంబయి
ధామంబును భర్తృసన్నిధానముఁ జేరెన్

152

కానలు కోనలున్ గిరులు కానక మానక పొంగిపొంగి సం
ద్రాన లయించు వాహినివిధాన; వియన్మణిలో సముద్రదా
వానల మైక్యమొందుగతి; నంబురుహాసన శారదాంబ వి
జ్ఞాన దివాకరుండు పరసత్త్వపయోనిధి భర్తఁజేరెఁదాన్

153

వచ్చిన సతిఁగని మెచ్చుచు
నచ్చపుటాదరము గదుర నచ్చెలువకు ము
న్నెచ్చట జరుగని మచ్చున
నచ్చెరువొందంగ నిట్టులనియె నతండున్

154

" ఇదిగో దేహము ! రక్తమాంసములతో నిచ్చోటనే బూదియౌ
నిది ! యిద్దానిని గోరుదో క్షణికమౌ నీయింద్రియాలోలతన్
ముదమేపారఁగ నిత్యశాంతిసుఖముల్ బూర్ణంబుగా నొంద ని
య్యది యాలంబముజేసి సాధనల బ్రహ్మైక్యంబు సాధింతువో

155

ఎటులైనన్ సరె నీయభీష్టము నిజంబీడేర్తు! నీవెంట సం
కట సంసారభయానకాపటలకాంతారమ్ము నల్లాడఁజే
యుటొ! నావెంట సముజ్వలంబయిన దివ్యోద్యానవాహ్యాళి వ
చ్చుటొ! నీచేతులనున్న దుల్లమును సంశోధించి వ్రాక్రుచ్చుమా!"

156

అన విని శారదాంబ క్షణమబ్బురమంది మరుక్షణంబులోఁ
గనియె నవగ్రహంబులు వికావికలై జగమెల్ల మండిపో
యినగతి రామకృష్ణుఁడు జితేంద్రియుఁడై చలనంబులేక పా
వనమగు దివ్యతేజమున భాసిలుచున్నటు విశ్వరూపమున్

157

ఆ ముహూర్తములోన బ్రహ్మాదిసురులు
సంభ్రమాశ్చర్యదిగ్భ్రమల్ చౌకళింప
ఆమె నిర్ణయ మాలింప ననిమిషులయి
నిలిచినారేమొ! వింతగఁ దలచిరేమొ

158

కాలచక్రము స్తంభించి కదలదాయె
ఆదిశేషుని తలభార మధికమాయె
అమ్మ కాళిక కనురెప్పలాడవాయె
అతని పెదవుల చిరునగవణగదాయె

159

పతిమార్గమ్ము గ్రహించి జీవితము తాత్పర్యంబు కాంక్షించి స
మ్మతిఁ దానున్ బతిమార్గమే యనుసరింపంబూని ధన్యాత్మ తా
నతిలోకోత్తరసాహసాంచితమహోత్యాగమ్ముతో శారదా
పతి ప్రత్యుత్తరమిచ్చె వాక్సుధలు నాస్వాదింప నాతండిటుల్

160

" ఏనిటకేఁగుదెంచుట యహీనగుణాంచిత ! దేవ ! మీ తపో
ధ్యానసమాధినిష్ఠలను దచ్చనఁ బాడొనరింపఁగాదు; స
మ్మానితమైన మీనియమమార్గమునన్ సుగమంబుచేసి మీ
తోనె చరించి ముక్తిరమతో జతగూడుట నాయభీష్టమా

161

సతి సహధర్మచారిణి ! వశంవద ! వీడని తోడువీడ యా
కతమునఁ బోవు స్వర్గనరకమ్ముల కెచ్చటకేని భర్తతో
స్తుతిమతి ! తావకీనపరిశోధితబోధిత దివ్యమార్గమే
గతియగునాకు ! మీసరస గాంతును నే నతిలోకసౌఖ్యముల్

162

ఎంత తపంబుచేసి జనియించినదాననొ ! పుణ్యమూర్తి ! మీ
చెంతకుఁజేరినాను ! దయసేయుఁడు నాకు నితాంతనిగ్రహం
బెంతకు మొక్కవోక చరియింపఁగ జీవితమంత కన్యనై
సంతసమంది మీకుఁ బరిచర్యలు చేతును ధర్మపత్నినై "

163

నా విని రామకృష్ణుఁడు ఘనంబగు సంతసమంది రాగసం
భావితమైన శారదను వత్సముఁజూచెడి గోవువోలె ప్రే
మావృతదృక్కులన్ బరపి యాదరముంగని చెప్పెనిట్లు లో
కావళి యబ్బురంపడగ నాత్మకతంబగు దివ్యభావమున్

164

" నినుఁ బెండ్లాడిన రామకృష్ణుడిట మున్నేయేగె నిప్పున్న యీ
తని నీపుత్రునిగాఁ దలంపుమిక సత్యంబమ్మ! యేరీతి నీ
కును గాళీజనయిత్రికిన్ నడుమ నాకున్ భేదమొక్కింతయున్
గనరాదమ్మ! అనుగ్రహింపుము! నమస్కారంబిదే తల్లిరో "

165

అని కాళీజనయిత్రికి
ననవరతము తానొనర్చునట్టి విధంబున్
మనముప్పొంగఁగఁ బూజల
నొనరించె " త్రిశుద్ధి " " అమ్మరో " యనిభక్తిన్

166

ప్రణయసుధలపాత్ర పాషాణరసమాత్ర
రెండు నివ్వగలరు స్త్రీలు నిజము
నరకమునకె కాదు నాకమ్మునకుఁగూడ
పంపఁగలరు తాము పడయఁగలరు

167

అదియొకలీల ! శారద మహత్తరనిర్ణయ మట్టులున్ననే
కద యతడంతరాయమును గ్రన్ననదాటెను ! లేక శారదా
సుదతి మరొక్కమార్గమును జొప్పడఁగోరిన వాని జీవితా
భ్యుదయము వర్ధమానమగునొక్కొ మరేగతి నేగియుండునో !

168

చూపులో వెన్నెలసోయగంబులు నింపి
మాతృవాత్సల్యంబు మనసునింప
ఘాటలో మందారమకరందములు నింపి
శాంతరసరంబును సంతరింప
నవ్వులో సంపంగిపువ్వుతావులు నింపి
విమలపవిత్రత పరిమళింప
మనసులో మానసవననిశ్చలత నింపి
స్వేచ్ఛత నిలువెల్ల పల్లవింప

భర్తచెంతను కన్యయై పరవశించి
"దివ్యదాంపత్య" మొనరించు భవ్యచరిత
శారదాంబకు సాటి యేనారివచ్చు
ముజ్జగంబుల నేకాలముననుగావి

**169**

భైరవీబ్రాహ్మణి యనెడు భక్తురాలు
వైష్ణవచరణుఁడాదిగా పండితులును
తాత్త్వికసదస్సులో "నవతారపురుషు"
డని వచింపఁగ రామకృష్ణుని నుతించి

**170**

"అవతారంబన నల్పమా! యెవని యాత్మాంశంబులై పుట్టునో
యవతారంబులు సర్వమున్ జగతి నా యాత్మేశుఁడేనీవు; మా
నవలోకంబును నుద్ధరింప నిటు చిన్మాత్రుండవై వచ్చి మా
భవబంధంబులు ద్రెంచినా" వనుచు సంభావించె గౌరీపతున్

**171**

రాసమణి యల్లుఁడును మో
క్షాసక్తుఁడు "మధురనాధు" డర్మిలి పేడన్
భాసురతీర్థములు దిరిగి
వాసిగఁ బెక్కండ్రు యోగివరులన్ గనుచున్

**172**

"దీనుల దుఃఖముల్ గరుణఁదీర్చెడివాఁడెమహాత్ముఁడెంత వి
జ్ఞానముగల్గినన్ మరి విచక్షణుఁడైనను నీచుడే దయా
హీను" డటంచు నిత్యము నహింసయు సత్యము శాంతిధర్మముల్
ఊని సమస్త పీడితజనోద్ధరణార్థము వేగు నెమ్మదిన్

173

" భావసమాధిలో జనని భాసిలఁజేసిన దివ్యరూపముల్
పావన జీవనాత్ములగు భక్తులు ముక్తులు రారదేల ? నే
నేవిధిఁ జూడగావలయు? నెక్కడనుందురు వార లీవియో
గావధిఁదాళలే " వనుచు నార్తముచెందెను రామకృష్ణుడున్

174

అట్టి శిష్యులలో జగజ్జెట్టియైన
ఆ నరేంద్రుని చరిత మత్యద్భుతంబు
వారిరువు రవినాభావబంధమునను
కారణాంతరజన్ములు ! ధీరవరులు !

175

"దైవనియుక్తవక్త" "పరతత్త్వశిరోమణి" యంచుఁ బంచఖం
డావరణమ్ముమ్రోగ భరతావని ధార్మికకీర్తిచంద్రికల్
భూవలయంబు నిండగ నపూర్వచరిత్రను సృష్టిచేసి సం
సేవితుఁడౌ "నరేంద్రుడు" విశిష్టుడు సంస్మరణీయు డెంతయున్

176

"చదువులకు సరస్వతి ! యీత సాములందు
దావరి! మధురగానగంధర్వు" డనుచు
తోడివారలు గురువులు తోరముగను
మెచ్చుకొన బ్రహ్మచారియై మెలకునతడు

177

చిన్నతనంబునుండి కడుసేవయు నీవియుగల్గి మానసం
బెన్నడు దైవలగ్నమయి యీశ్వరదర్శనకాంక్ష వేఁగఁగా
నెన్నికఁగన్న తత్త్వనిధులెందరినోకని తృప్తిలేక యా
పన్నులఁబ్రోచుమార్గమును బ్రాపొనరింప కృషించు నిత్యమున్

178

శయనముఁజేరి ధ్యానమున శంకరునిన్ దలపోయు నంతలో
రయమున రెండుదృశ్యములు రమ్యముగాఁ గనవచ్చు "సాధువై
జయములు పొందుటల్-మరియు సంపదతో భవరోగబాధతో
భయమున గుందుటల్-ప్రతిదివాంతమునందు విచిత్రవైఖరిన్

179

ఎన్నిదినంబులైన నదియే కనవచ్చుటఁజేసి యెంతయున్
ఖిన్నతనొంది నిర్ణయము కేవలమున్ గొనలేక వేదనా
పన్నతనొంది సద్గురుని పారముజేరఁగ నుత్సహించి ప్ర
చ్ఛన్నమనోరణమ్ము పడజాలక దేశము జూడనేగియున్

180

చూచిన భక్తులందరను సూటిగ "దేవుని చూచినావ? నీ
చూచినవాని నాకిపుడు చూపఁగఁజాలుదువా?" యటంచు వా
చాచకితమ్ములేకడిగి సంగతమైన జవాబురాక బా
ధాచలితార్తిసర్వలవిదారితమానసుడై చరించుచున్

181

చివరకు దక్షిణేశ్వరముఁజేరి యటన్ గనె దివ్యతేజముల్
నవనవలాడుఫాలమును నాగరికంబులు లేని వేషమున్
ధవళవిశాలనేత్రములు దాపరికంబులులేని మాటలున్
ప్రవిమలరాగరంజితవిరాజితదేహముగల్గు వానినిన్

182

కని " యీతండొక పిచ్చివాఁడా! విధివక్రంబైన పూజారియో!
జనులన్ గారడిచేసి లోఁగొనెడి కాంక్షారక్తుఁడో! సక్తుఁడో!
ధనసంపాదనకై కషాయమితవస్త్రాచ్ఛాదసన్యాసియో! "
అని తర్కించుచునుండ వానిఁగని యత్యానందసంరంభమున్

183

" వచ్చితివాకుమార! నిను పంపెదనంచు వచించెనమ్మ! కా
ర్చిచ్చువలెన్ దహించెమదిఁ జింత నిరంతము నీవురామిచే
నెచ్చటనుంటి వింతదనుకెట్టులు సైచితివీవియోగ; మే
నిచ్చటనుంట నీవెరుగవే? మనసాయెనె నీకు నేటికిన్? "

184

అని వాత్సల్యముతోడఁ గన్నుగవస్నేహార్ద్రమ్ముకాగా నరేం
ద్రుని గాఢమ్ముగ రామకృష్ణుడట సంతోషమ్ముతోఁ గౌగిలిం
చిన; దిగ్భ్రాంతినిజెంది యాతడవెఁ గించిద్భగ్నసందేహియై
" కనినారాభగవంతునిన్ దమరు నిక్కంబేర్పడన్ జెప్పరే! "

185

" దేవుడవీవుగావె ? భవదీయుడుగాడె విభుండు ? కానిచో
భావన యెట్లుగగ్లె భగవంతుని జూడఁగ ?" నన్న ప్రశ్నతో
మావి తొలంగి వెల్తురుల స్మార్తమునొందిన బిడ్డవోలె హ
ర్షావృతుడై నరేంద్రుడనె "నైనచొ దేవుని నాకుజూపుడీ !"

186

ఆకలిఁగొన్న పాపవలె నశ్రులు చాచిన జాలినొందుచున్
దాకొని రామకృష్ణుడును దక్షిణపాదముతో నరేంద్రునిన్
దాకినఁ దక్షణంబె స్మృతితప్పి సమాధిని బొంది యంతరా
లోకనఘూర్ణమానసవిలోచనుడై కనె నాతడిమ్మెయిన్—

187

లోకములన్నియున్ వెలుగులో లయమై తదనంతరంబు వి
శ్వాకరమైన శూన్యమున నద్భుతతేజము దుర్నిరీక్ష్యమై
వీక జ్వలించిపోవఁ గనువేదురునొంది నరేంద్రుడద్భుతో
ద్రేకముచెంది "చూచితిని! దేవునిజూచితి" నంచుఁ గూకిడెన్

188

అంతట విశ్వమున్గల చరాచరసృష్టిసమస్తమున్ ప్రభా
వంతుడు రామకృష్ణుడు దవానలమై వెలుగొంద; వానిలో
భ్రాంతిమయప్రపంచము విరామములేక భ్రమించుచుండ ధీ
మంతుడు గాంచి యిటనె "నమః గురుదేవ ! నమోస్తుతే ! నమో !"

189

రామకృష్ణు డాదరమ్మున మెల్లగ
గుండెనిమురఁ మనసు కుదుటఁబడియె
కుదుటఁబడిన మనసు కూలంకషప్రజ్ఞ
గురునిఁ దెలియ నతడు మురిసిపోయె

190

" నభగంభీరవివేకమున్ గలిగి యానందంబు రాజిల్లుటన్
అభయంబంది నరేంద్ర! నీవిక "వివేకానంద" నామమ్ముతో
శుభసందేశమునిచ్చి హైందవమతస్రోతస్వినీధీసుధల్
ప్రభలంబంచుము పంచఖండముల నిద్రల్లేపి సంప్రోక్తవై "

191

అని దీవింప నరేంద్రుడంతట వివేకానందుడై స్కంధుడై
ఘనహిందూమతతత్త్వసత్యములు లోకంబెల్లఁ జాటించి పా
వన సన్యాసము బ్రహ్మచర్యమును సద్భక్తిన్ సదాపూని యూ
ర్జ్వి "నభూతో నభవిష్యతీ"మ్మనఁ బ్రవర్తిల్లెన్ మహావక్తయై

192

ఆ నయాగరపాతవాక్యామృతంబు
పంచఖండంబులను పొంగి ముంచివైచె
సాటి లేనట్టి వాని వాగ్ధాటిలోన
సృష్టి మూగవోయి పరవశించి నిలిచె

### 193

అల ప్రపంచ సర్వమతమహాసభాంత
రమున హిందూమతంబె సర్వమతములకు
తల్లిమతమని యెల్లమతములచేత
వినుతిఁగనుటద్ది యాతని ఘనతకాదె

### 194

ఏమహావక్తచే హిందూమతంబెల్ల
మతముల తల్లిగా మాన్యతఁగనె
ఏమహావక్తచే నెల్లదేశములందు
భారతప్రతిభ సంభావ్యమయ్యె
ఏమహావక్తచే భూమండలంబెల్ల
తత్త్వవిజ్ఞాన ముద్ధరణగాంచె
ఏమహావక్తచే రామకృష్ణుడు దేవు
డై లోకమునకు విఖ్యాతుడయ్యె

ఆ మహావ్యక్తితోగాని రామకృష్ణ
చరిత పరిపూర్తికాదు; వారిరువు రరయ
శబ్దభావమ్ములట్లు తేజమునురూప
మట్లు విడదీయరాని మహాత్ములగుట

## 195

ఆతడు రామకృష్ణహృదయంబున కద్దము హైందవమ్ములో
లోతులుచూచి సత్యము విలోకనజేసి సమస్తధర్మముల్
ప్రీతిఁగఁగొన్న రూపమటు పెంపెసలారి ప్రపంచమంతటన్
ఖ్యాతి గణించుకొన్న పరమాత్మపదాంకితజీవనుండిలన్

## 196

రామకృష్ణుని కంఠమున్ వ్రణముపుట్టి
హోరమైనను గొనకుండ నడ్డుపడిన
బాధనొంది నరేంద్రుడు భద్రకాళి
చెంత కరుదెంచి భక్తివచించె నిట్లు—

## 197

"అమ్మవునీవు బిడ్డలకు నక్కట కష్టము దాపురింపగా
కిమ్మనవేల ? బాధ్యత యొకింతయులేదె? సుతుండు నన్నపా
నమ్ములులేక చిక్కిన మనంబున జాలిఁదలంపవేమి? యే
తెమ్మిక! తల్లికిన్ గడుపుతీపికి మించిన తీపియున్నదే ?"

## 198

అనినఁ గాళికాంబ అతనికి వివరించె
మనుజభాషణముల వినగనిట్లు
"నాయనా! నరేంద్ర! నన్నాడకుముతండ్రి!
ఏ నశక్తురాల నిందు నిజము"

199

అనిన నరేంద్రుడందలి యదార్థమునన్ గ్రహియించి సిగ్గిలెన్
తన యవివేకమున్ దెలిసి "తల్లివచింపఁగనేల నేనెరుం
గనె యవతారమూర్తియని! కారణజన్ముఁడటంచు మద్గురున్;
తనువునువీడఁ గారణము తాఁ గ్గొనె నిట్టు"లటంచు నెమ్మదిన్

200

చిత్తము కుండలిన్ నిలిపి చేతలుమాని సమాధినిష్ఠలో
క్రొత్తవెలుంగు మోమునిగుదొత్త ప్రసన్నసుహాసమాస్యమున్
హత్తి ప్రఫుల్లమంది పదహారుకళల్ వికసింప బాధ కిం
చిత్తు నెరుంగకుండ విలసిల్లెను పూర్ణుడు రామకృష్ణుడున్

201

భరతజనయిత్రి గర్భమున్ ప్రభవమంది
పంచఖండంబులకు ధర్మపథము జూపి
ఏబదేడులు మనుజుడై యిలనుగడిపి
పరమపదమునుజేరెను పరమహంస

202

ఎందరులేరు తత్త్వనిధు లింతకుముందు ప్రపంచమందు వా
రందరు కేవలంబు తమకై తపియించిరిగాని మానవా
నందముఁగూర్పఁ బాటుపడినారె నితాంతము? రామకృష్ణుడా
చందముగాక సర్వులకు శాంతిసుఖంబులు గూర్పనేర్పడే!

203

రామకృష్ణుడు యోగిమాత్రమ్మె కాదు
వర్ణభేదమ్ము వలదన్న వరివసితుడు
సాంఘికసమత్వమునుగోరు సహృదయుండు
దేశభక్తుల కొరవడి! దివ్యతముడు

204

వింతలకెల్లవింత యనిపించును సత్త్వపదార్థతత్త్వరూ
పాంతరమూర్తి కేవల నిరక్షరకుక్షియటన్నమాట! యే
పంతులుచెప్ప రీపరులభావనకందని దివ్యపాఠముల్
ఎంతటి విద్యయున్న లభియించునె జ్ఞానము పుణ్యమేదినన్

205

అడవులకేగి యొంటరిగ నాకులు దుంపలు పండ్లుమెక్కి పెం
జెడలనుబెంచి మానసము చిక్కఁగఁ బట్టఁగలేక దేహమున్
గడు బడలించి క్రుక్కుట మగంటిమికాదు; గృహస్థజీవియై
నడలని నిగ్రహంబుగొని సంయమిగావుట దెంతకష్టమో!

206

వర్గ మత కుల భేదభావమ్ము నీచ
మనుచు విశ్వసౌభ్రాత్రసౌహార్దములను
మానవాళికి నేర్పి విజ్ఞానసుధల
మనిచినట్టి మానవుడు బ్రహ్మర్షియతడు

207

మట్టియందును నపరంజి మణులయందు
సమహితత్వంబు గలుగు నిష్కామయోగి
మానవాభ్యుదయాకాంక్షనూని జీవి
తము సమర్పణచేసిన త్యాగియతడు

208

సృష్టిలోఁగల ఒక్కొక్క జీవియొక్క
భద్రసచ్చిదానంద రూపమ్మటంచు
అతడు చూపిన స్వీకారమనెడుదారి
మానవునకు దేవునకు సామ్యమునుగూర్చు

209

పాపము వృద్ధినొంది ఋజువర్తను లార్తినిఁగుందఁజూచి సం
తాపమునొంది దేవుడవతారముదాల్చి భువిన్ జనించి తా
బాపును దుష్టశక్తులను భక్తులఁ గాచును ; మంచిమార్గమున్
జూపును శాంతిసౌఖ్యములు జూరఁగొనన్ ప్రజ ధర్మబద్ధులై

210

అందరి డెందమందుగల అయ్య ఒకండె! అఖండసచ్చిదా
నందమయుండు వానిశతనామములల్లె మతంబులున్ భువిన్
వందలు వేలునయ్యె! తనభక్తుడు పెట్టిన పేరుతోడ రూ
పొందును దైవమంచతడు మ్రొక్కెను సర్వమతాలవారికిన్

211

" భరతభూమినిసోకు వాయువుల్ తత్త్వార్థ
సందేశములు బల్కు సతమునాకు
భరతభూమినితాకు పాదధూళియుగూడ
పరమ పవిత్ర సంపదయెనాకు
భరతభూమినిగల్గు ప్రత్యంగుళము పుణ్య
తీర్థమ్మె క్షేత్రమ్మె తీరునాకు
భరతభూమినిదన్పు ప్రతి నీటిబిందువున్
అమృతోపమానమ్మె యగునునాకు

బాల్యమున పాఠశాల! నవానురాగ
యౌవనంబున నందనమదియె నాకు
వార్ధకమునందు శాంతిసంవర్ధకంబు
భరతభూమియె కైవల్యపదమునాకు "

212

అని " యనుష్ఠానవేదాంత " మరయ నేరపి
" ఆత్మవత్ సర్వభూతాని " యనెడు ధర్మ
మక్షరమ్ములఁ బాటించు నతని జీవి
తమ్మె ప్రత్యక్షర పఠనీయమ్మె సుమ్మె

## 213

నిత్యజీవితమందుఁ గొన్పించునట్టి
సంఘటనలను తాత్త్వికసత్యమరసి
తేనెలొలికెడు పలుకులఁదెలియఁజెప్పు
టాతనికి వెన్నతోఁ బెట్టినట్టి విద్య

## 214

శిష్టసంరక్షణ దుష్టసంహారణ పరి
రక్తకాళీసుస్థిరత్వ మేమొ
శారదాసహవాససంప్రాప్తపరమహం
సాగమజ్ఞానదివ్యత్వ మేమొ
విశ్వమతస్తోత్ర విఖ్యాతనయవివే
కానందహృదయప్రియత్వ మేమొ
సర్వత్రసౌభ్రాత్రసాధనకృషిసిద్ధ
నవనవోన్మేషమానవత యేమొ

తనువుగొని రామకృష్ణుడై ధరణి వెలసె
నో! యన ప్రణవామృతభాండ మొక కరమున
ఒక కరమున విజ్ఞానదీపికను గొనుచు
వచ్చిన మహాప్రవక్త! శ్రీ పరమహంస

215

గుడిలోని అమ్మవారొడిలోన నిద్రించు
పసిడినవ్వుల పసిబాలకుండు

కాకీలు రాకుండ లోకమ్ములకు వేద
పాఠమ్ము బోధించు పండితుండు

అగ్నిసాక్షిగఁ బెండ్లియాడిన అర్ధాంగిఁ
దల్లిగాఁ బూజించు తత్త్వవేత్త

దేవుడే లేడంచు ధిక్కరించిన నరేం
ద్రుని వివేకిని నొనర్చిన గురుండు

అతఁడు కరగని తత్త్వహిమాలయమ్ము
అతఁడు దరిలేని జ్ఞానసీరాకరమ్ము
అతఁడు జీవిత ధర్మవిద్యాలయమ్ము
అతఁడు మానవతాంక దేవాలయమ్ము

216

స్రగ్విణి

సౌమ్యసౌజన్యసంస్కారమూర్తీ ! నమః
గమ్యనిర్దేశికాఖండ తేజా ! నమః
కామ్యమోక్షప్రవక్తా ప్రదాతా ! నమః
రమ్యశీలా ! ప్రభూ ! రామకృష్ణా ! నమః

## సుధ

శ్రీకరమై పవిత్రమయి సింధుగభీరమునై మనోజ్ఞమై
ప్రాకటమై ముముక్షుజనపాళినిదాఘసుధాప్రపూర్ణమై
శ్లోకసమున్నతంబయి రసోత్తమునై తనరారు వాని గా
థాకమనీయకావ్యమధుధారలు వాని ప్రసిద్ధసూక్తులే

### 218

పచ్చని బంగారము గో
ర్వెచ్చని మీగడ శిరీషపేశల దళముల్
మచ్చరికించును స్వచ్ఛము
నచ్చపుతీపి మృదులమగు నతని పలుకుపై

### 219

ఘనమగు నర్థభావములు కప్పురతావులు గ్రుమ్మరింపగా
ననితరసాధ్యమై భవభయంబులుబాప సమర్థమై పరం
గిన యతిలోకజన్ముని సుకీర్తితసూక్తులు సంస్మరించి జీ
వన పరమార్థమున్‌గని ప్రభావిత మానసు లౌతమిత్తరిన్

### 220

"పవలు కానరాని పలుతారకలుగూడ
ఉన్నయటులె దేవుడున్నవాడు
కన్నుఁదెరచి వెదుకఁ గనరాడురావాడు
చూపునిలిపి లోనఁజూడవలయు"

221

"ఒక నరుడింటిలోఁగలుగు నొక్కరికొక్కవిధంబు వావియై
సకలము నొక్కడై గృహము చక్కయొనర్చెడిరీతి దేవుడున్
ఒకడయి ఎవ్వరెట్లు మది నూహనొనర్చినఁ జూడఁబిల్చినన్
ప్రకటితమౌను వారికటు; వట్టివి వానికి రూపభేదముల్"

222

"ఇష్టముండికాని యితరులచేఁగాని
స్నానమాడ మురికి చనినయట్లు
ఎవ్విధంబునైన నీశ్వరనామమ్ము
స్మరణచేయఁగలుగు సత్ఫలమ్ము"

223

"జలదము లాక్రమించిన విశాలవిహాయసమందు భాస్కరుం
డెలరు దొలంగి మాటువడు; నెంతటిజ్ఞానముఁగాని భోగవాం
ఛల తెరచాటునంబడి విషాదమునించును; గాన భోగముల్
వలని విముక్తినొంది భగవంతుని జ్ఞానముతోఁ గనన్వలెన్"

224

"లక్కపిడతలతోడ నాట్లాడు పాప
తల్లి కనుపింప నవి వీడి తల్లిఁజేరు
సర్వవిభుఁగాంచినంత విశ్వమును మరచి
అతని దరిజేరు మనసు బ్రహ్మైక్యమొందు"

225

"దాగుడుమూతలాటలను దల్లినిజేరిన బాలుడింక నెం
దేగిన దొంగ కానియటులే భగవంతుని కొక్కసారి సు
స్వాగతమిచ్చి జీవితము నర్పణచేసిన మానవుండు తా
నేగతినైన నెట్టిభయ మెన్నడుపొందడు కుందడిద్ధరన్"

226

"మతములనునవి దైవసమ్మతములగునె ?
ఆత్మవిశ్వాసమే నిజమైన మతము
తొరగిదాని; నాడంబరస్ఫురణఁ బరగి
ఆత్మవంచనచేయుట హానికరము"

227

"కొలిమిని నిప్పులారక యకుంఠితరీతిని రాఁజు నట్లుగా
కొలది కొలందిగా పవనకుంభితచర్మము నొక్కుఁగమ్మరీ
డెలమిని; సాధుసంగమము నెంతయురాఁజిలి మానసాగ్ని ని
శ్చలము పవిత్రమై వెలుగు చంచలవాంఛలు కప్పకుండగన్"

228

"ఒకడు భోగియైన ఒకడు త్యాగియగును
యోగియగు నొకండు రాగియగును
నమ్ము మెల్లవారు నారాయణులటంచు
దాన నీవు నిజము తరియగలవు"

229

"ధరణీపాలుని యాదరమ్మున సమస్తానందముల్ బొందు బి
త్తరి కాంక్షింపదు బిచ్చగానివలపున్ తథ్యంబు; హృత్సీమ నీ
శ్వరు దర్శించిన మానవుండు మరలన్ ప్రాపంచికానందముల్
దరిరానీడు; నిరంతరంబు పరమాత్మానందమున్ బొందుచున్"

230

"తనువుపైన మోహతమమున్న దనుకను
లోన నున్నవాడు కానరాడు
మబ్బుచాటు ప్రొద్దు దబ్బరయగునొక్క-
మబ్బుతొలఁగఁ గాంతి గుబ్బతిల్లు"

231

"అత్తకు మామకున్ మగని కన్నివిధంబుల సేవచేయుచున్
చిత్తము ముద్దుబిడ్డపయిఁజేర్చి చరించెడు స్త్రీ విధమ్ముగా
ఉత్తమభక్తు డీశ్వరు మహోన్నతునిన్ మరువంగలేడు తా
నెత్తరి నెట్టులున్న; రమియింపదు మానస మన్యమందెటన్"

232

"పాలఁబుట్టి చల్ల పాలతోఁ జతగూడి
పెరుగుచేసి పిదప వెన్ననిచ్చు
దేవునంశఁబుట్టి జీవుండు పరమాత్మఁ
జేరి తుదిని మోక్షసిద్ధిఁగాంచు"

233

"మధుపము తేనెఁబూరెకి సుమంబులకై నిరశంబుఁగ్రుమ్మరున్
వ్యధితమనంబుతోఁ గరుణభావము ఝుమ్మన పాటపాడుచున్
మధువులభింప ఝుమ్మనుట మానును తన్మయచిత్తవృత్తితో
బుధులును సిద్ధులైన సరిపోలుదు రిట్టులు మౌనశీలురై"

234

"పక్షి యేల వచ్చి పంజరంబునజిక్కు
ఎందువలనఁ దిరిగి యెగిరిపోవు?
ఎగిరిపోయిపిదప నేమగునో యద్ది
తెలిసికొనుము భయముతొలగి మనుము"

235

"కోరికయున్నచో జలము కూపమునుండిఁగ్రహింపవచ్చు నే
దో రకమైన సాధనముతో; పరమాత్ముని నమ్మికొన్న సం
సారులుగూడ ముక్తిఁగనఁజాలుదు రంచిత దీక్షబూని యే
మారక స్థైర్యమున్‌విడక మానసమున్ మధియింపఁగల్గినన్"

236

"కర్కశ కరాళములగు చీకటులుగూడ
చిన్నదీపము వెలుగుతోఁ జెదరిపోవు
జన్మజన్మలనాటి దుష్కర్మకూడ
నాశనంబగు నాత్మార్పణమ్మువల్లన"

## 237

" కొనకొని యగ్గిరాయి పదికోటులయేండ్లు జలాలనానినన్
మునుపటిపోలె నగ్నికణముల్ వెదజల్లును రాచినంత ; భ
క్తుని విధమట్టిదే ; మలినకూపమునంబడియుండికూడ నెం
దును మలినంబునంటక మనోనియతిన్ జరియించు ముక్తుడై "

## 238

"గమ్యమునుజేర నెన్నేనిగతులుగలుఁగు
మతములట్టివె దేవునిమర్మమెరుఁగ
దారియేదైనఁగాని నిదానమున్న
చేరవచ్చును గమ్యంబు స్థిరముగాను "

## 239

" పడవను నీటిపైనిడి ప్రవాహము దాటఁగవచ్చు ; దానికై
పడవను నీటిమీద నిలుపన్వలెఁ గాని జలంబుమాత్ర మా
పడవఁ జొరంగరాదు ; భవబంధములన్ విడనాడువార లా
పడవనువోలె దేహమును భద్రముగాఁగని ముక్తిఁగాంచెడిన్ "

## 240

" హింస పాపమ్ము ; పరులచే హింసఁబడక
ఆత్మసంరక్షణముగూడ నవరసమ్ము
కస్సుమనకున్న పామును కాకికూడ
పొడిచిచంపును ; రక్షణ పొందవలయు "

## 241

" ధనరత్నంబులు గల్గు పెట్టె నతిభద్రంబొప్ప రక్షించు రీ
తిని సర్వేశ్వరవాసమై జననరక్తింగాంచగాఁగల్గు సా
ధనమైనట్టి శరీరమున్ మిగుల శ్రద్ధంజూచి కాపాడ నే
ర్చిననాడే ముదమంచు నందుగల యాజీవుండు శాంతాత్ముడై "

## 242

" పాదరసలిప్తమౌ గాజుపలకమందు
ప్రతిఫలించును చేఁగొన్నవానిముఖము
కరుణ సత్యంబు ధర్మంబుగల్గు హృదయ
మందుఁ బరమాత్మదర్శనమగును నిజము "

## 243

"ఆరోగ్యంబుగలట్టివాడు తిను నాహారంబు దక్కించుకో
నేరంగల్గినరీతి మానవుడు నిద్రిద్రాతినిష్ఠారతిన్
వైరాగ్యంబును పెంపుసేయుతరినే భాష్యార్థవిజ్ఞానసత్
సారస్యమ్ము ఫలమ్ము నొందఁగలుగున్ సర్వత్రసంతోషియై"

## 244

"ఆతడొకనాడు నిర్గుణుడై రమించు
మరియు నొకనాడు సగుణుడై వరలుచుండు
భక్తజన మానసమ్ముల ప్రతిఫలించు
వర్ణ మాభక్తునిష్టమ్ము బట్టియుండు"

245

" మానవజన్మ మిచ్చుటకుమాత్రమె ; పుచ్చుకొనంగఁగాదు నే
దానమొనర్చినాడనని దర్పముబూనకు ; చేసినట్టి నీ
దానము స్వీకృతంబగుట ధన్యుడనైతినటంచు నెంచుమో
మానిసి ! జీవితమ్మనె సమర్పణజేసి వరింపుమీశ్వరున్ "

246

" ఆతడొకడె జీవసముద్రమందు మునిగి
ఒకట క్రీస్తయి మరియు వేరొకట రాము
డై మహాత్ముడై తేలి ఆ యాసమాజ
ములకు మోక్షమ్మునిచ్చు వారలమతాల "

247

" సుమము ఫలించి కాయయగుచోఁ దొలఁగున్‌గదె పత్రముల్ క్రమ
క్రమముగ, మానవుండు తన ఖర్మఫలంబులు పొందుచున్ సదా
శమదమసత్యపాలనము చాలిక(జేసి ముముక్షువైన ని
క్కము పరమాత్మనిన్ గనును కాంతిమయంబగు దెందమందునన్'

248

"అతడు సాకారు డొకభక్తు డడిగినట్లు
ఒగి నిరాకారుడగును వేరొకనికోర్కె
బట్టకట్టుట మానుటవలన నీకు
వ్యక్తియందేమి భేదమ్ము వచ్చునయ్య ?"

249

"పాలను వెన్నయున్నదని పల్కినమాత్రన వెన్నదక్కునే
పాలనుజిల్కకుండ ? భగవంతుడు సృష్టిఁగలండటంచు వే
వేలుగ నాడినన్ గవనవిజ్ఞతఁ బాడిన దర్శనంబు కా
బోలునె ? భక్తిభావమునఁ బూనికతో కృషిచేయకుండినన్"

250

"క్షీర నీరమ్ములను విభాగించి హంస
పాలనే త్రాగురీతిని భక్తులెపుడు
ఇతరులందున్న మంచినే యెంచవలయు
చెడునుజూచిన హృదయమ్ము చెడునుసుమ్ము"

251

"ప్రీతిన్ లోభి ధనంబుగూర్పఁ బరులన్ బీడించు చందంబునన్;
పాతివ్రత్యముగల్గు భామిని నిజప్రాణేశుఁ బ్రేమించు నా
రీతిన్ లేగ పయఃప్రలోభమునఁ దల్లిన్ గ్రుమ్మ్రతేవన్ సదా
చేతఃపీఠమునందు దేవుని ప్రతిష్ఠింపన్ బ్రయత్నించుమా"

252

"దీనజనులఁగావఁ దివిరి యత్నించు చే
జ్ఞానికెపుడు మోక్షసాధనమ్ము
దయయుఁ బ్రేమలేని తత్త్వబోధలు కాగి
తంపు పూలవోలె తప్పలగును"

253

" దీనులకై తపించుటన దేవునకై జపియించు చేయగున్
మానవులందులేని పరమాత్మ మరెచ్చటనుండు? భక్తియున్
జ్ఞానముఁకన్న ప్రేమయె నిజంబుగ గొప్పది; కాన నీశ్వరున్
గానఁగవచ్చు శీఘ్రముగ కారుణికోత్తములైన మానవుల్ "

254

" కొలదితెలిసి నరుడు కూపస్థమండూక
మట్టు లదియె సర్వమని భ్రమించు
జ్ఞానసాగరుండు కానలేడద్దరి
నదియె తారతమ్యమరయ జనుల "

255

" తామరయుఁన్న చర్మమున దండిగగోకిన హాయిహాయిగా
గోముఁగనుంను ముందు; వెన గోకుటమానినతోడనే వెగల్
ప్రామినరీతిమండు; నిహవాంఛలుకూడ తతర్థవై ఖరిన్
బాము జనింపఁజేయును నివారణగాక ప్రవర్ధమానమై "

256

" పరుసవేదితాకి బంగారమైనట్టి
ఇనుపకత్తి తొంటి తనదురూపు
మాయకున్న కరుసుమాత్ర ముండనియట్లు
అతనిఁగన్న మనుజు డాత్మమారు "

257

" ఈతను నేర్చుకోదలచి యెన్నిదినంబులు గట్టుమీదనే
ఆతతశాస్త్రపాఠములు నబ్బురమౌగతి వల్లెవేసినన్
చేతగునే ? వివేకి దృఢచిత్తముతో డిగి సాధనంబుతో
నీతను నేర్చుకోగలుగు; నీశ్వరదర్శన మట్టిదేసుమా !"

258

" నిన్ను నీవు తెలిసికొన్నచో దేవుండు
తనకుతానె తెలుపుకొనును నీకు
తెలుపుకొన్ననాడు స్థిరముగాఁ దనలోన
నిలుపుకొనును నిన్నుఁ గలుపుకొనును "

259

" వాసనలేనిపువ్వులటు పండితులెప్పుడు శబ్దశాస్త్ర సం
త్రాసముతోడఁ గుందెదరు దైవముమాట తలంపకుండ; వి
శ్వాసముగల్గి దైవము నుపాసనజేసెడి వారికెట్టి శా
స్త్రాసవ మక్కఱిల్లదు సుధాసమభక్తిరసంబె చాలెడిన్ "

260

" పొత్తములను జదివి పత్తు చిత్తనిపల్కు
పండితులకుఁ దలలు పండుగాని
మనసు పండదెపుడు మర్మంబుతెలియక
చిలుకకేమితెలియు పలుకుగాని "

261

"జ్ఞానవిరాజితుండయిన సద్గురువెప్పుడు పావనుండె గం
గానదివోలె! దుష్టులిడు కల్మషముల్ హరియించిపోవు వి
జ్ఞానధునీతరంగముల; సచ్చరితుండగు ఛాత్రుడెప్డు స
మ్మానితమైన భక్తిగాని సద్గురుసేవ దరింపఁగోరెడిన్"

262

"గురువునందు భక్తి కొరవడినంతనే
శిష్యుడాత్మలోన శిథిలమగును
రాతికుండకైన రంధ్రంబుచాలదే
బోలుకాగ కుండ బూలికాగ"

263

"ద్యుమణి సహస్రబాహువులు దూయు చరాచరమున్ సమానవై
కమలము రాగరంజితవికస్వరమౌ! ముకురంబు కాంతి వి
భ్రమమునొనర్చు! సూర్యశిల భగ్గునమండును! వానిస్పర్శచే;
అమరగురుండు తానొకడె! అందరుశిష్యులు నొక్కటౌదురే?"

264

"దయయుఁ బ్రేమలేని ధనమేల బలమేల?
సాగరమున లవణజలముభంగి
సాటి మనుజునందు సద్భావమేతేని
జన్మమేల చదువుసంధ్యలేల?"

265

" మించకముందె రోగమురమించిన యంగము నేర్పుతోడ ఖం
డించకయున్న దేహమును డీల్పడఁజేయును సర్వమున్; మదిన్
పొంచిన దుష్టవాంఛలను పోకడపెట్టకయున్న జన్మమే
పంచకమౌను శాంతికనుపట్టక! కొట్టక పొట్టుపోవునే ? "

266

"పసిడిఁ బడతి నొంటి పడయఁగల్గినగాని
ముట్టకున్నవాడె మోక్షగామి;
తలఁపునైనఁగాని తత్కాంక్షయున్నచో
అంటకున్నఁగాని యధముడతడు "

267

" హింసనొనర్చువాడధము డెన్నగ ప్రాణము తీయుటొక్కటే
హింసయ ? మానసమ్ము భరియింపఁగలేని కఠోరవాక్కులున్
హింసయె! దుష్టభాషణము హీనగుణమ్మును దెల్పు! మానవో
త్తంసులు నన్యమానసవిదారణ కొప్పరు తాము గుందినన్ "

268

" సాధుజనుల చరిత చదివినమాత్రాన
ఫలములేదు చెడును వదలకున్న
రంగువేసినంత రాయి రత్నమగునె ?
ఆత్మబలములేని యల్పునట్లు "

269

" అక్కఱ యున్నయంతదను కచ్చికబుచ్చికమాడి మిత్రులన్
ప్రక్కకునెట్టునట్టి నయవంచకు డున్నతి పొందలేడు ; తా
నెక్కిన తెప్పగాల్చు నరుడెన్నటికైన గృహోన్ముఖుండు గా
కెక్కడికేగు ? వచ్చి నది నెట్టులుదాటును ? తెప్పలేనిచో "

270

" పచ్చనాకునందు పసిడి పళ్ళెరమందు
నెందునిడిన నన్న మేకవిధమె !
రూపవంతులకుఁ గురూపులకును గూడ
ఆత్మవిభుడొకండె అందరకును! "

271

"మానవజన్మమే నిరుపమానము! నందున దైవభక్తి స
మ్మానితమైనజన్మ తలమానిక; మట్టులుగాక మూఢులై
హీనపథంబుఁబోవఁ దరియింపఁగవచ్చునె చావుపుట్టుకల్ ?
కాన పరాత్పరున్ మదినిఁగాంచి చరింపుము ముక్తిమార్గమున్"

272

"ఎల్లప్రాణులందు నీశ్వరుండున్నాడు
వానిఁదెలియఁగలుగు వారెబుధులు;
చదువు సంధ్యలెల్ల సర్వేశ్వరునిజూపు
కొఱకెగాని కూడు కొఱకుగాదు"

## 273

" ధనదాన్యంబులు నాలుబిడ్డలును హోదాదర్పముల్ భోగముల్
గని యత్యల్పసుఖంబు శాశ్వతమనంగా విశ్రవీగున్ మోహి; జీ
వనసత్యంబు గ్రహింపలేడతడు; చేపన్ నీటిలోనుంచి గ
ట్టునకున్ దెచ్చినరీతిఁ గొట్టుకొను దుఃఖం డంత్యకాలమ్మునన్ "

## 274

" పొలొసంగునేయి వత్తిని వెలిగించు
వెలుగదెపుడు పొలువలన వత్తి;
ఆత్మలోని భక్తి ఆటువంటిదేకదా
భక్తితోనె అతడు బయలుపడును "

## 275

" వెలుగున్నప్పుడె యిల్లు దిద్దుకొనుమా వెల్గుల్‌నశింపంగ లో
పల నేమున్నదొ కానరాదు; పిదపన్ వాపోయి ప్రార్థించినన్
కలుగన్నేరదు లాభమింతయును, దుష్కర్ముండు గర్వాంధుడై
విలపించున్‌దుది చీకటుల్‌ముసిరి నిర్వేదమ్ము ప్రాప్తించగన్ "

## 276

" కాకిగూడునందు కోకిలపుట్టును
కాని కాకిపిల్లకాదు పికము;
స్థలముకాదు పూర్వజన్మసంచితఫల
మాత్మకిడును రూపమాగమమున "

277

" తలపై మానికమున్నమాత్రన శిరోధార్యంబె కాలాహి ? వి
ద్యలు నేర్వన్ సుగుణుండు కాడు కుజనుండార్యుల్ సమర్చింప; భ
క్తులు దారిద్ర్యములోనకృంగినను ముక్తుల్ గాన సమ్మాన్యులే !
శిలలంబుట్టినఁగాని రత్నములు సంస్తుతంబులే మూల్యమున్ "

278

" త్రాళ్ళఁగట్టి మనసు దండింపఁగల్గుదే ?
మనసు తెలియరాదు మాయలోన
మాయవీడి మనసు మర్మంబు తెలియుమా
దానఁగలుగు సత్యదర్శనంబు "

279

" అసిధారావ్రతచర్యలున్ సకలపుణ్యక్షేత్రసంచారముల్
గసికల్ మీదఁబరుండిచేయు హఠయోగంబుల్ తపోనిష్ఠలున్
పసహీనంబులు; బ్రహ్మచర్యమును విశ్వప్రేమ సత్యంబు దీ
ముసమొప్పన్ సతతంబుఁబూను నెడ నాత్మన్ దైవమాసీతమౌ "

280

" అరుణరేఖ ద్యుమణియాగమనమ్మును
తెలుపునట్టు లాత్మఁగలుగు వెలుఁగు
తెలుపునతని దివ్యతేజమ్ము కనుగొన
వెతకు మాత్మలోన వెలుగునింపి "

281

" దాతలు కీర్తికాములయి దానముచేతురు తామె పేదలన్
ప్రీతిగఁ బ్రోచుచున్నటులు; వీరికి నా ధనమెట్టులబ్బె ; నే
ఖ్యాతినిగోరి వారలకఖండధనంబులొసంగె దేవుడీ
రీతమెరింగి సంపదను సద్వినియోగము చేయగావలెన్ "

282

" పెండ్లి యగునంతదాక వేర్వేరు వ్యక్తు
లగు వధూవరులు వివాహమైన నొక్క
టగుదురుకద ! జీవుడు పరమాత్మ యట్లె!
సద్గురువు పురోహితుఁబోలి సంఘటించు"

283

ఇట్టి సత్యంబు లింక నెన్నెన్నొ చెప్పి
నీ మధురవాక్సుధాధార నిఖిలజగతి
అమృతమయమొనరించి విశ్వాత్మవగుచు
శాశ్వతుడవైతివయ్య విశ్వస్వరూప !

284

విద్యున్మాల

వందే వందే బ్రహ్మాధారా !
వందే వందే భవ్యావంతా !
వందే వందే భద్రానందా !
వందే వందే భక్తాధీనా !

# స్తవము

శ్రీవేదాంతకళాతపస్వి! సకలశ్రేయోనిధీ! శారదా
దేవీమానసపద్మపూజితపదా! దివ్యాత్మకా! సత్యవా
సా! విజ్ఞానసుధాంబుధీ! పరమహంసా! రామకృష్ణప్రభూ!
భావాతీత! మహాత్మ! శక్తిమయ! దేవా! మా నమోవాకముల్

286

శ్రీరామప్రభు విశ్వమానవసదాశ్రేయోభిలాషిత్వమున్
కారుణ్యప్రభు కృష్ణు దీనజనకాంక్షారక్షణోద్దీప్తియున్
నీరూపంబున రామకృష్ణుడయి జన్మించెన్‌గదాయంచు నిన్
జేరన్‌వచ్చినవా సమస్తమహిమల్ శ్రీరామకృష్ణప్రభూ!

287

నీవైరాగ్యము నీమనోదృఢిమ నీనిర్నిద్రనిష్ఠారతుల్
నీవైశిష్ట్యము నీసహోదరత నీనిర్మోహముల్ నీప్రజా
సేవోత్కంఠత చూచి పొంగిపులకించెన్ సర్వసర్వంసహా
భావోద్యానము భారతాంబకు నమోవాకమ్ములర్పించుచున్.

288

యుగపురుషుండవా? నవమహోజ్జ్వలసాత్త్వికధర్మమూర్తివా?
జగదనురాగసంభరితశాంతమహోదయసృష్టికర్తవా?
అగణితభక్తి విశ్వహృదయంబున కెక్కిన ధర్మవీర! ఏ
మగుదురునీకు క్రీస్తును మహమ్మదు నీశ్వరసన్నిధిన్ ప్రభూ!

289

నీతేజోధిషణామహామహిమ మిందేగాదు సర్వంసహా
చేతోవీధుల ధర్మరోచులు వెలార్చెన్దొల్లి; నిన్నెంచి తా
మాతృప్రేమ గుబులొల్కఁగనన్ సతము సంభావించు ముక్తప్రజా
శ్రీకంఠంబులగొంతుగల్పి భరతోర్వీదేవి సంతుష్టయై

290

ఆకల్పాంతము నీపవిత్రఘనశాంత్యారాధనోద్దీప్తి వి
శ్వైకప్రేమ ఘటించి భారతవిశిష్టాధ్యాత్మికాఖ్యాతవై
ప్రాకారమ్ములు గట్టుమిద్ధరణి నణ్వస్త్రాలగూండాలు రా
లేకుండన్; జగమెల్ల భారతయశోలీలల్ ప్రభాసిల్లగన్

291

పరమపవిత్రహైందవశుభప్రదధర్మవిహాయసప్రభా
కర ! భవదీయనిర్మలవికాసవినూత్నమరీచిమాలికా
స్ఫురణవహించి లోకము సముజ్జ్వలమైవికసించి రాగసం
భరితమనస్సుమాంజలి సమర్పణజేసెడి స్వీకరింపుమా

292

అతిసామాన్య నరేంద్రబాలుని వివేకానందుగా వంద్యుగా
అతిలోకోత్తరమానవప్రవర దైవాంశప్రపూర్ణాభుగా
మతవైషమ్యతమస్పహప్రకరుగా మాన్యాత్ముగా దిద్ది తీ
ర్చితివా తండ్రి ! భవన్మహామహిమ నేరీతిన్ వచింతున్ ప్రభూ !

293

ఏలోకంబుల నెట్టులుండిననుగానీ చల్లనౌ నీదు ది
వ్యాలోకంబుల మమ్ములన్ గనుముదేవా! స్నిగ్ధరాగార్ద్రస
చ్ఛీల ప్రేమలు మాయెడందలను రాశీభూతమై యొప్పగన్
లీలాత్మా! యొనరింపుమయ్య సతమున్ నిన్నే స్మరింపన్ మదిన్

294

ఓ మహనీయ సత్త్వసుగుణోన్నత! తావక విశ్వమానవ
ప్రేమకు మోసులెత్తినది సృష్టిసమస్తము; జ్ఞానమూర్తి! నీ
నామము విన్నయంత జననంబు తరించుగదోయి రామకృ
ష్ణా! మహిమాన్వితా! పరహితార్థపరాయణ! మానసస్పృదే!

295

మంగళమహాశ్రీ

శ్రీ మకుట! విశ్వజనసేవితపదాంబుజ! వి
శిష్టవచనామృతపయోధీ!
కోమలమనోహరవికుంఠహృదయా! సుజన
కుంజపికకూజితవినోదీ!
కామదహనా! సుఖజగద్విముఖమానస! వి
కారభవబంధనవిరోధీ!
తామసవిభంజన! సదావిమలసత్యపర
తత్త్వరుచిరోన్నతకృపాబ్ధీ!

ఓం శాంతిః శాంతిః శాంతిః

# సమర్పణ

" నవ్యవిద్యావిధాన " విజ్ఞానచతుర !
అనఘ ! " ముత్యాల " వంశదుగ్ధాబ్ధిచంద్ర !
" సుబ్బరాయ " సుధీవర ! శుభచరిత్ర !
అంకితమొనర్తుఁ గైకొను డాదరమున.

నా కవితాశ్రీ కన్యను
మీకరముల బెట్టినాడ మేలిమికూర్మిన్
పాకుడు; మీదంపతులకు
ప్రాకట నీరాజనములు పట్టుదురు ప్రజల్

శ్రీమద్దివ్యకథాసుధ
రామాయణ భారతాది గ్రంథంబులతో
నేమాత్రము తూగదు కా
నీ మానవజన్మకునిది నిక్షేపమయా !

## ఆశీస్సు

ఈ దివ్యకథాసుధ న
త్యాదరమున గ్రోలి వరలు డంచితపదపుల్
శ్రీదర్పంబులుగొని నే
డాదిగ నమరులు నజరులునై ముదమొప్పన్.

---

ఓం భద్రం కర్ణేభిః శృణుయామదేవా
భద్రం పశ్యేమాక్షభిర్య జత్రాః
స్థిరైరంగైస్తుష్టు వాగ్ంసస్తనూభిర్
వ్యశేమ దేవహితం యదాయుః

ఓం శాన్తి శ్శాన్తి శ్శాన్తిః

O Gods, may we hear with our ears what is auspicious. O Ye adorable ones, may we see with our eyes what is auspicious. May we, full of praise of the Highest, enjoy in healthy body with perfect limbs. May we live our allotted years as ordained by the gods.

Om. Peace. Peace. Peace.